25.8.1995 శుక్రవారం 12 పేజీలు సంపుటి:67 సంచిక:32 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



### అర్థాంగిపై ప్రేమతో ఎన్టీఆర్ రాజకీయ ఆత్మహత్య

# తెలుగు సైకిల్ బరస్ట్!

### కొడుకుల తిరుగుబాటే ఎమ్మెల్యేల కంత ధైర్యమిచ్చింది

ఎన్టి రామారావు రాజకీయ ప్రాభవం పున్నట్లుంది గ్రహణం బారిన పడింది. నిన్నటి వరకు మధ్యందిన మార్తాండుడి వలె తేజస్సుతో ప్రకాశిస్తుండిన ముఖ్యమంత్రి నేడు కొడిగట్టిన దీపం వలె మినుకు మినుకు మంటున్నాడు. ఒక్క రోజులో ఎంత మార్పు? వూహించడానికి అలివి కావడం



లేదు. బుధ, బేస్త వారాలలో రాజకీయ పరిణామాలు సినిమా రీళ్ల వలె తిరిగి పోయాయి. ఆగస్టు నెల అంటే ఎన్టీఆర్‌కు ఎక్కడ లేని గిలి; ఆర్థిక మంత్రి కూడా అయనకు అచ్చి రావడం లేదు. 1984 లో నాదెండ్ల సంక్షోభం వలె ఇప్పుడూ అవి రెండూ ఎన్టీఆర్ రాజకీయ వైభవానికి గ్రహణం పట్టించాయి; రాహువు, కేతువుల వలె మసక కమ్మేశాయి.

ఈ వార్త వ్రాసే సమయానికి వున్న పరిస్థితిని బట్టి ఎన్టి రామారావు గారు ముఖ్య మంత్రిగా దిగి పోక తప్పదని తేలిపోయింది. ఏడు నెలల క్రితం 215 మంది ఎమ్మెల్యేల అఖండ సంఖ్యా బలంతో పదవీ ప్రమాణం చేసిన ఆయన - ఈ రోజు (25 తేది) పట్టుమని

## ఇట్లా జరుగుతుందని చంద్రబాబూ అనుకోలేదు

పాతిక మంది ఎమ్మెల్యేలు కూడా తోడు లేని పరాభవ పరిస్థితులలో చిక్కుకొని పోయాడు. తను కన్నవాళ్లే తనను ధిక్కరించి, తన పాదాల క్రింద గోతులు త్రవ్వడంతో తనను తాను సమర్థించు కోలేని, రక్షించు కోలేని నిస్సహాయ, నిర్వీర్య, నిర్జీవ, నిరామయ, నీరవ మానసంతో కుప్ప కూలిపోయాడు.

నిన్నటి వరకు ఎవరూ కల కూడా కనలేదు ఇట్లా జరుగు తుందని; ఆఖరకు చంద్ర బాబు నాయుడూ అనుకోలేదు. అంతా మాయ వలె జరిగి పోయింది. కలలో వలె జరిగి పోయింది; కళ్ల ముందే ఎన్టీఆర్ నిర్మించుకున్న సుందర స్వప్న సౌధం కుప్ప కూలి పోయింది.

విజయ నగరంలో ప్రజా సదస్సు ముగించుకొని 23 తేది హైదరాబాదుకు తిరిగి వచ్చిన ఎన్టీఆర్ దంపతులు, వారి వెంట వచ్చిన చంద్రబాబు నాయుడులకు ఎమ్మెల్యేల తిరుగుబాటు దిగ్భ్రమ కల్పించింది. చంద్రబాబు విమానం దిగే సరికి 110 మంది ఎమ్మెల్యేలు ఆయన్ను చుట్టు ముట్టారు. సస్పెన్షన్లు, క్రమశిక్షణా చర్యలతో నియంతృత్వంగా, కక్ష సాధింపుగా వ్యవహరిస్తున్న లక్ష్మి పార్వతి దుడుకు తనానికి మీరు బ్రేక్ వేయగల్గితే వేయండి, లేకుంటే మాదారి మేము చూసుకొంటాము అని ఎమ్మెల్యేలు బాబుపై వత్తిడి తెచ్చారు. వారి వత్తిడి




తట్టు కోవడం చంద్రబాబుకు అలివి కాలేదు. వారిని సమాధాన పర్చడం కోసం అశోక గజపతి రాజా నాయకత్వంలో ఒక ప్రతినిధి బృందాన్ని ఎన్టీఆర్ వద్దకు రాయబారం పంపారు. ఆయన మొండిగా తిరుక్కొన్నారు; "లక్ష్మిపార్వతి నా భార్య; ఆమె పార్టీకి నాయకత్వం వహించి తీరుతుంది; మీరందరూ ఆమెను అనుసరించి తీరాలి; కాదు, కూడదంటే నేను సహించను" అని ఎన్టీఆర్ తెగేసి చెప్పేశారు. ఈ మొండి సమాధానం ఎమ్మెల్యేలను రెచ్చగొట్టింది. అప్పటి

కొరవ 7 పేజీలో

# నెల్లూరు ఎమ్మెల్యేలు హోల్మొత్తంగా జారుకున్నారు!

రాజధాని రాజకీయ పరిణామాలలో నెల్లూరు శాసన సభ్యులు గాలి వాటు సూత్రం పాటించారు, లౌక్యానికి మారు పేరుగా వ్యవహరించారు; హోల్మొత్తంగా లక్ష్మి పార్వతికి టాటా చెప్పి, చంద్రబాబు పంచన చేరారు. 23 తేది సాయంత్రం వరకు తట పటాయింపులో వుండిన వారు 24 తేదికి త్రాసు ఎటు తూగుతున్నదో గ్రహించి గబగబా అటు దూకేశారు. నికరంగా ఎన్టీఆర్‌కు మిగిలింది మంత్రి నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డి ఒక్కరే.

వెంకటగిరి రాజా గారు అటు, ఇటు లేరు. రాజా వారు కదా - ఏ అంతః పురంలోనో పవళింపు సేవలో వుండి వుంటారు. నిద్ర మేలు కొనేటప్పటికి రాజ్యం చేతులు మారి పోతుంది. రేపటికి కాని ఆయన అటో, ఇటో, ఎటో తేలదు.

## రమేష్‌రెడ్డి పంట పండింది!

తక్కిన ఎమ్మెల్యేలలో రమేష్ రెడ్డి రెండు నెలలకు పై నుంచే అన్న గారికి దూరంగా, అన్న గారి సుపుత్రుల వారికి చేదోడు వాదోడుగా వున్నారు. అందువల్ల చంద్రబాబుకు తొలి ఓటు ఆయనదే; తటపటా యింపేమీ లేదు. గూడూరు బల్లి దుర్గా ప్రసాద్, సూళ్లూరు పేట పరసా రత్నం వెనుక ముందు ఆలోచించ కుండా మొదటి రోజే జై చంద్రబాబు అని నినదించేశారు. ఆత్మకూరు ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్య నాయుడు దగ్గుపాటి శిష్య పరమాణువు. ఆయన పచ్చజెండా వూపే వరకు ఎదురు చూసి, 24 తేది సాయంత్రం బండి ఎక్కారు. ఉదయగిరి కంభం విజయ రామిరెడ్డి ఎటు పోతే ఏమి అనర్థమో అర్థం కాక 24 తేది మధ్యాహ్నం వరకు సతమతమై పోయాడు. పరిస్థితి తేటతెల్లం కావడంతో గోడ మీద నుంచి గబుక్కున దూకేశాడు. రాపూరు ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డికి ఇంకా సంకట పరిస్థితి. ఆయన హత్య కేసు ఫైలు ఎన్టీఆర్ దగ్గర వుంది. తొందర పడితే రాజకీయం సంగతి దేముడెరుగు, కృష్ణ జన్మ స్థానం ప్రాప్తిస్తుందని భయం. అందువల్ల చివరి నిముషం వరకు వేచి చూసి, నికరంగా మొగ్గు తేలిందని రుజావు అయిన తర్వాతే నిర్ణయం తీసుకున్నాడు. సర్వేపల్లి సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి రాజకీయంగా మహా మేధావి. లోతైన ఆలోచన వున్నవారు. ఏదో ఒక ప్రక్క చేరి భ్రష్టు పట్టేకంటే, ఇద్దరికీ పంచిగా వుండడం శ్రేయస్కరమ... 24 తేది రాత్రి రైలెక్కి వరకు గుంభనంగా వుండి పోయాడు. రైలు దిగగానే రోడ్లన్నీ ఏ రూమ్ వైపుకు దారి



తీస్తున్నాయో అర్థమైంది; ... పోయాడు.

# గ్రేమార్కెట్‌తో ఘరానా మోసం!

**షేర్‌లోకం — డాక్టర్ ఎ. దుర్గాప్రసాద్**

భారతీయ షేర్ మార్కెట్ మోసాలకు పర్యాయ పదమై పోతున్నది. తక్కువ కాలంలో సంపన్నులు కావాలనే దురాశతో షేర్ మార్కెట్‌తో జూదమాడే దురలవాటుకు ప్రజలు బానిస లౌతుండడమే ఈ దుస్థితికి మూల కారణం. షేర్ల పేరు మీద ఎన్నెన్ని ఎత్తులు, ఎన్నెన్ని జిత్తులు, ఎన్నెన్ని మోసాలు, ఎన్నెన్ని చిట్కాలు, ఎన్నెన్ని రకాల దోపిడీలు జరిగి పోతున్నాయో చెప్పలేము. వీటిలో ఇప్పుడు ప్రముఖంగా కన్పిస్తుండేది - గ్రే మార్కెట్.

గ్రే మార్కెట్ అంటే ఒక రకంగా బ్లాక్ మార్కెట్. సినిమా హాళ్లలో టిక్కెట్ల బ్లాక్‌లో అమ్మినట్లు షేర్లను అమ్మడ మన్నమాట. పబ్లిక్ ఇష్యూలకు వచ్చే కంపెనీలు, ఇష్యూ తేదికి ఒక నెల ముందే తమ షేర్లపై వ్యాపారం చేయడం గ్రే మార్కెట్ కార్యక్రమం. ఇంతకు ముందు అహమ్మదాబాద్, సూరత్, జైపూర్ వంటి నగరాలలో ఇది విస్తృతంగా జరుగు తుండేది. అనధికారికంగా ప్రతి షేర్‌కూ ఒక ప్రీమియం ధర నిర్ణయించి, షేర్లు విడుదల కాక ముందే వాటిని కొని, అమ్ముతుండే వారు. ఈ అనధికార ధరలు చూసి మన ప్రాంతంలో కొందరు ఈ గ్రే మార్కెట్ వ్యాపారం చేసేవారు. ఇప్పుడు అది దేశమంతటికి ప్రాకి పోయింది. ఆంధ్రలో, మరీ ముఖ్యంగా నెల్లూరులో కూడా గ్రే మార్కెట్ కార్యకలాపాలు చురుకుగా వున్నాయి. ఈ వ్యాపారంలో నష్ట పోయేది అమాయకులైన చిన్న ఇన్వెస్టర్లు. పబ్లిక్ ఇష్యూకు వచ్చే కంపెనీల ప్రమోటర్లు, పెద్ద బ్రోకర్లు, స్టాక్ ఇన్వెస్ట్ చేసే ఫైనాన్స్ కంపెనీలు కలిసి ఈ ఘరానా మోసాన్ని పకడ్బందీగా నిర్వహిస్తున్నారు. ఎ గ్రూప్ షేర్లపై ట్రేడ్ చేసే బ్రోకర్లు, ఫార్వర్డ్ ట్రేడింగ్ విధానం తమ కనుకూలంగా రాక పోవడంతో తమ నిధులను బి గ్రూప్ షేర్ల పై మళ్లించి గ్రే మార్కెట్‌ను విస్తృత పరుస్తున్నారు.

ఈ మార్కెట్ ప్రధాన కార్యక్రమం కొత్త షేర్ల పట్ల ప్రజలలో ఆసక్తి కల్గించడం. కొన్ని కంపెనీలను ఎంపిక చేసుకొని ఒక పథకం ప్రకారం వాటి పట్ల ఆసక్తి కల్గేలా కల్పించిన వివరాలు, వార్తలతో ప్రచారం చేస్తారు. దానితో చిన్న పెట్టుబడి దారులకు ఆశలు కల్గుతాయి. ఇష్యూ ద్వారా తమకు అలాట్ మెంట్ వస్తుందో రాదోనని ఆత్రుత పడి గ్రే మార్కెట్‌లో అధిక ధర చెల్లించి కొనుగోలు చేస్తారు. ఈ పద్ధతిలో ప్రమోటర్లకు ఇష్యూకు ముందే డబ్బు చేతికి చేరిపోతుంది. ఇష్యూకు ఒక నెల ముందే ఇది జరిగి పోతుంది. ఇష్యూ ప్రారంభం కాగానే ప్రమోటర్లు - స్టాక్ ఇన్వెస్ట్ ఫైనాన్స్

కొరవ 8 పేజీలో

## థాపర్స్ అబద్ధాలు చెప్పాలా?

దేశంలోని ప్రముఖ పారిశ్రామిక కుటుంబాలలో ఒకటైన థాపర్స్ గ్రూప్ కూడా ఇన్వెస్టర్‌ను తప్పు దారి మళ్లించ డానికి అబద్ధాలు చెప్పుస్తున్నదంటే, వినడానికే ఆశ్చర్యంగా వుంటుంది. కాని ఇది నిజం. వీరు ప్రమోట్ [illegible] బెస్ట్ లిమిటెడ్ కంపెనీ 36 కోట్ల కోసం మొన్న జనవరిలో పబ్లిక్ ఇష్యూ [illegible] చేసింది. ఒక్క షేరు 38 [illegible] ప్రీమియంకు అమ్మార [illegible] వారు విడుదల చేసి [illegible] 95 మార్చి నాటికి 82 కోట్ల అమ్మకాల పై 7 కోట్ల నికర లాభం వస్తుందని వ్రాశారు. కాని ఫలితాలు ప్రకటించిన తర్వాత చూస్తే 40 కోట్ల అమ్మకాల పై 86 లక్షల నికర నష్టం వచ్చింది. రెండింటికీ ఎంత తేడా వుందో చూడండి! పబ్లిక్ ఇష్యూకు వచ్చే నాటికే రొయ్యలకు వైరస్ తెగులు వుంది. 94 అక్టోబరులోనే కంపెనీలోని రొయ్యలకు వైరస్ సోకి చనిపోయాయి. డిసెంబరు నాటికి 90 శాతం చెరువులు నష్టపోయారు. కాని జనవరిలో పబ్లిక్ ఇష్యూకు వచ్చేటప్పుడు ఈ నిజం దాచి పెట్టారు. ఇంకొక ప్రక్క జనవరికి 9 నెలల వ్యాపారం జరిగి పోయినట్లు లెక్క. మార్చి లోపల 3 నెలలే వుంది. అప్పటికి అమ్మకాలు తక్కువన్న నిజం దాచి పెట్టి, మార్చి నాటికి 80 కోట్ల అమ్మకాలు చేస్తామని అబద్ధాలు ప్రాస్పెక్టస్‌లో వ్రాశారు. క్రాప్ హాలిడే వల్ల మార్చి లోగా పంట తీయలేమన్న సంగతి మరుగు పరిచారు. ఒక రకంగా ఇది తప్పుడు సమాచార మందజేసి ఇన్వెస్టర్లను మోసం చేయడమే. థాపర్స్ వంటి పెద్ద గ్రూప్‌లు కూడా ఇట్లా అబద్ధాలు చెప్పడం [illegible]

## ఎన్‌ఆర్‌ఐల ఐక్యతతో అద్భుతాలు!

విదేశాలలో వున్న భారతీయు లందరిని కలిపే ఉద్దేశ్యంతో ఎన్‌ఆర్‌ఐ గ్లోబల్ ఫోరం [illegible] ఏర్పడింది. విదేశా లన్నింటిలో [illegible] ఇంచు మించు కోటి మంది [illegible] వున్నారని అంచనా. వీరికి దరిదాపు 100 బిలియన్ డాలర్ల (13 లక్షలా 15 వేల కోట్ల రూపాయలు) ఆస్తులు వున్నాయని అంచనా. వీరి వ్యాపారాల టర్నోవర్ 340 బిలియన్ డాలర్లు, అంటే 10 లక్షల కోట్లకు పై మాటే. వ్యాపారస్తులు కాని, ఉద్యోగస్తులు కాని ఏటా లక్షా 50 వేల కోట్ల వరకు పొదుపు చేస్తున్నట్లు అంచనా.

అపారమైన ఈ సంపదను భారత దేశంలోకి పెట్టుబడి రూపంలో ప్రవహింప చేయాలనే ఉద్దేశ్యంతో ఈ ఫోరం ఏర్పడింది. ఎన్‌ఆర్‌ఐలను సమీకరించి, వారిని పెట్టుబడికి ప్రోత్సహించడం; తమ నిధులతో భారత దేశంలోని ప్రభుత్వాల పై రాజకీయ పరమైన ఒత్తిడి తెచ్చి, తమ కనుకూలమైన విధానాలు రూపొందించడం, పెట్టుబడిని కాపాడడం దీని ప్రధాన లక్ష్యం. ఇది ఆచరణలోకి వస్తే కొన్ని లక్షల కోట్ల నిధులు భారత పారిశ్రామిక రంగంలోకి తరలి [illegible]

# మృత్యుశకటాలు

ఆగ్రా సమీపంలోని ఫిరోజా బాద్ దగ్గర 20 తేది రాత్రి జరిగిన రైలు ప్రమాదం అత్యంత ఘోరమైనది; విషాద కరమైనది. అర్ధరాత్రి దాటిన నిద్రా సమయం; ఒక్కరూ మెళకువగా లేరు; చుట్టూ గాఢాంధ కారం; వున్నట్లుండి భూమి బ్రద్ధలైన చప్పుడు; పిడుగులు పడినట్లు, ఆకాశం నుంచి బాంబుల వర్షం కురిసినట్లు చెవులు దద్దరిల్లే శబ్దాలు; కనురెప్ప పాటులో, క్షణాల్లో జరిగి పోయిన విధ్వంసం. ఏమి జరిగిందో, ఏమి జరుగు తున్నదో తెలుసుకొనే లోగానే రక్తం ఏరులై పారింది; తునా తునకలై శరీరా వయవాలు చెల్లా చెదరై పడ్డాయి; శవాలు గుట్టలు పడ్డాయి; ఆ దృశ్యం చూడలేము; ఆ విలయం వర్ణించ లేము; ఆ ఘోరాన్ని వివరించి చెప్పలేము. వేకువన 3 గంటల ప్రాంతంలో ఈ ఘోరం జరిగితే, తెల్లవారి 5.30 గంటల వరకు ప్రపంచానికి తెలియలేదు. పాల కోసం ఇళ్లలో నుంచి నిద్రలేచి బయటకు వచ్చిన జనం గమనించి నంత వరకు వందలాది మంది నిర్భాగ్య ప్రయాణీకులు కాళ్లు తెగి, చేతులు విరిగి, నడుములు ముక్కలై, హాహాకారాలు చేస్తూ, ఆక్రందనలు చేస్తూ, గుండెలు చెరువు లయ్యేలా ఏడుస్తూ, ఆ చీకటిలో, ఆ రాళ్ల మధ్య, ఆ శవాల గుట్టల మధ్య, ఆ రక్తపు మడుగుల్లో తడుస్తూ పడి వుండ వలసి వచ్చింది.

ఎంత ఘోరం? ఎంత దారుణం? ఢిల్లీ వెళ్లే పురుషోత్తమన్ ఎక్స్‌ప్రెస్, అంతకు క్రితమే పట్టాల మీద నిల్చి వుండిన కలింది ఎక్స్‌ప్రెస్‌ను వెనుక నుంచి ఢీ కొనడంతో జరిగింది ఘోరం! కలింది ఎక్స్‌ప్రెస్ ముందుగా ఫిరోజా బాద్ స్టేషన్ దాటి వెళ్లింది. అయితే ఔటర్ క్యాబిన్ దగ్గర ఒక ఆవు వచ్చి ఇంజన్ క్రింద పడిందట. దానితో రైలు నిల్చి పోయింది. డ్రైవరు క్రిందకు దిగి, ఇంజన్ భాగాల్లో చిక్కుక పోయిన ఆవు మాంసపు ఖండాలను తొలగించు కుంటుండి నాడు. ఇంతలో వెనుక నుంచి పురుషోత్తమన్ ఎక్స్‌ప్రెస్ వచ్చింది. ముందు, పట్టాల మీద వేరొక రైలు నిల్చి వున్న సంగతి ఆ డ్రైవర్‌కు తెలియదు. తెలియ చెప్పాల్సిన క్యాబిన్ అటెండెంట్ నిద్ర మత్తులో వుండినాడు. పచ్చ సిగ్నల్స్ వెలుగు తుండినాయి. ఈ రైలు పోయి దాన్ని ఢీ కొన్నది. ఈ పెట్టెలు, ఆ పెట్టెలను చీల్చుకుంటూ వెళ్లి, విరిగి పోయి, క్రింద పడినాయి. పెట్టెల్లో నిద్రిస్తుండిన ప్రయాణీకులు నిద్రలోనే నలిగి పోయారు. కొందరి శవాలు నూరు గజాల అవతలకు ఎగిరి పడ్డాయట. అధికారుల లెక్క ప్రకారమే 350 మంది వరకు చనిపోయారు. అనధికార లెక్కలు 600 మంది అంటున్నాయి. 400 మందికి పైగా గాయపడ్డారు.

ఒకే ఒక్క క్యాబిన్ అటెండెంట్ పొరపాటు, ఇందరి జీవితాలను చిందర వందర చేయడం, చిదిమి వేయడం దారుణం. భారతీయ రైల్వేలలో ఇటువంటి ప్రమాదాలు సర్వ సాధారణమై పోయాయి. గత ఆరు నెలల్లో దేశం మొత్తం మీద 199 రైలు ప్రమాదాలు జరిగితే, అందులో 117 దుర్ఘటనలు కేవలం రైల్వే సిబ్బంది పొరపాటు వల్ల సంభ వించినవేనని రైల్వే అధికారుల లెక్కలే చెప్తున్నాయి. పరిస్థితి ఇంత తీవ్రంగా వున్నా, దాన్ని నివారించ డానికి రైల్వే శాఖ ఎటువంటి ప్రయత్నమూ చేయక పోవడం క్షమించరాని నేరం.

రైల్వేల ఆధునీ కరణలో టిక్కెట్లకు కంప్యూటర్లు పెట్టి, రైళ్ల వేగం పెంచు తున్నారు కాని, సిగ్నలింగ్ వ్యవస్థలో మార్పులు చేయడం లేదు. బ్రిటీషు కాలం నాటి పద్ధతులలోనే పచ్చ జెండాలు వూపు కొంటూ గడిపేస్తున్నారు. గ్యాంగ్ మెన్‌లు, లైన్ మాన్‌లు, క్యాబిన్ అటెండెంట్‌ల దయా దాక్షిణ్యాల మీద లక్షలాది ప్రయాణీకుల బ్రతుకులు ఆధార పడవలసి వస్తున్నది. స్టేషన్ మాస్టర్, డ్రైవరు, గార్డు, క్యాబిన్‌ల మధ్య సమాచార సంబంధాలు ఇంకా ఆ పాత సంకేతాల మీదనే ఆధార పడివున్నాయి. వైర్‌లెస్‌లు, సెల్యులర్ ఫోన్లు, సెటిలైట్ లింకుల వంటి సమాచార విప్లవం ప్రపంచాన్ని ఉక్కిరి బిక్కిరి చేస్తున్న ఈ ఆధునిక కాలంలో డ్రైవరు, గార్డుల మధ్య జెండా వూపే సంకేతం తప్ప, మరేమీ లేక పోవడం నిజంగా సిగ్గు పడ వలసిన విషయం.

జమీన్‌రైతు

ఈ ప్రమాదానికి బాధ్యత వహించి రైల్వే మంత్రి, ఇతర ఉన్నతాధి కారులు తమ పదవులకు రాజీనామా చేయాలన్న ప్రతిపక్షాల డిమాండ్ సహేతుక మైనది. మారుతున్న పరిస్థితులకు, అవసరాలకు అనుగుణంగా ప్రమాద నివారణ జాగ్రత్తలు తీసు కోవడంలో విఫలమైన వారికి కనీసం ఆ మాత్రం నైతిక బాధ్యతైనా వుండాలి కదా? రైళ్ల వేగానికి తగినట్లు సిగ్నల్ వ్యవస్థను ఆధునీ కరించాలని పలు ప్రమాదాలను పరిశోధించిన విచారణ సంఘాలు రైల్వే మంత్రిత్వ శాఖకు సూచించాయి. ఆ సిఫార్సు లన్నింటినీ చెత్త బుట్ట దాఖలు చేసి, ప్రయాణీకుల ప్రాణాలతో చెలగాట మాడుతున్న రైల్వే మంత్రి, రైల్వే బోర్డు సభ్యులు, ఉన్నతాధి కారులు క్షమార్హులు కారు. వీరి నిర్లక్ష్యం వల్లనే రైళ్లు మృత్యు శకటాలుగా మారి పోతున్నాయి.

ప్రధాన మంత్రి ఆదేశం పాటించి ఇప్పటికైనా ఇటువంటి ప్రమాదాలు మళ్లీ పునరా వృతం కాకుండా జాగ్రత్తలు తీసు కోవడం అత్యవసరం.

---

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

జమీన్‌రైతు

24.8.1945

వెల: 0-1-6 పేజీలు:8

### గాంధీజీ ఉపవాస గండం

హరిజనాభ్యుదయము, అస్పృశ్యతా నివారణల విషయమై అహర్నిశలు ఆలోచన యందు గల మహాత్ముడు మరొక మహత్తర ప్రాయోప వేశం. హరిజనుల కొఱకై ప్రారంభించు తాడట.

ఆ వుపవాస శక్తికి తాను ఆహుతియైన పిమ్మట, అదే పూరిరి దేశమంతటా వరుస వెంటనే ఒక్కొక్కరూ వుపవాసాలు చేసి, అస్పృశ్యత నివారింప బడేవరకు, ఆహుతి అవుతుండాలట. ఈ విధంగా మహాత్ముని ఆలోచన నడుస్తున్నది. మహాత్ముడు, యితర నాయకుల మరణాలకు హిందూ సంఘం బాధ్యురాలు గాకుండాలంటే - వెంటనే అస్పృశ్యత పోగొట్టండి. లేకుంటే "మహాత్ముని మరణముకు హిందూ సంఘం మూలహేతువు" అని నల్లటి అక్షరాలతో చరిత్ర కారుడు చిత్రిస్తాడు.

### సుభాష్‌చంద్రబోసు

ఈయన 'ఆజాద్ హింద్' సైన్యాధి పతి హబీబుల్ రహమాన్ సాహెబ్‌తో కలిసి ఆగస్టు 16న సింగపూరు నుండి టోకియో వెళ్లే తోవలో విమాన ప్రమాదం జరిగి గాయపడెను. దరిమిలాను ఆగస్టు 18న టోకియో ఆస్పత్రిలో చనిపోయినని జపాన్ రేడియోలో ప్రకటించారు.

### పల్లెటూళ్లు

**నాయుడుపేట**

గుడ్డల కరువు - కాదు దొంగ బజారు - మావూరుకూ వచ్చింది. తాన్ల తాన్ల గుడ్డ దగ్గరుంచు కొనిగూడా మల్లు గుడ్డ యివ్వమంటారు! కోటాదారును సాక్ష్యం పెట్టి ఒక గుడ్డల అంగడి ఆయన మీద రిపోర్టు చేయబడింది.

**కోవూరు**

నారపరెడ్డి రామిరెడ్డి కవి నాలు కమ్యూనిస్టు మీటింగుల కధ్యక్షత వహిస్తున్నాడు మాస్కో మతం పుచ్చుకొన్నాడా అని సందేహం.

**మీ పెనా తీసుకోండి**

13.8.45 తేది నెల్లూరు పెద్ద పోస్టాఫీసు వద్ద వుత్తరం వ్రాసి కునేందుకు నాకు పేనానిచ్చి మరచి వెళ్లారు. ఆ పేనాను టవున్ పోలీసు స్టేషన్‌లో యిచ్చి వచ్చాను. వెళ్లి తీసుకోండి దానివాళ్లు.

**కోట మిడిలిస్కూలు**

హైస్కూలు స్థాపన కార్య నిర్వహణ కమిటీ కోరిక పై 15 తేది జిల్లా బోర్డు ప్రెసిడెంటు గోవింద రెడ్డి, డి.యి.ఓ. డివిజనల్ యిన్సుపెక్టరు సదాశివరెడ్డి గార్లు కోటకు వచ్చి విచారించి ప్రస్తుతం జిల్లా బోర్డుకు డబ్బులేదు. మీరే భూమి కోవాలని చెప్పి మధ్యాహ్నం భోజనా నంతరం వెళ్లిపోయిరి.

కొనసా 10వ పేజీలో

---

## జనవాణి

# అయ్యవార్ల ట్యూషన్లతో పిల్లల చదువులు నాశనం!

పూర్వం క్లాసు రూముల్లో మరీ వెనుకబడి వున్న విద్యార్థుల తల్లి తండ్రులు బ్రతిమి లాడితేనే ఉపాధ్యాయులు ట్యూషన్లు చెబుతుండే వారు. కాని ప్రస్తుతం ఉపాధ్యాయులకు ట్యూషన్లు ముఖ్యమై పోయాయి. క్లాసు రూముల్లో బోధన పట్ల శ్రద్ధ వుండడం లేదు. పలువురు క్లాసు రూముల్లో పాఠాలు చెప్పడం ఏనాడో మర్చి పోయారు. కోచింగ్ సెంటర్లకు ఉపాధ్యాయులు ఎగబడి పలువురు కుబేరు లౌతున్నారు. చదువు 'కొనే' ఈ రోజుల్లో ప్రభుత్వ అజమాయిషీలో పనిచేస్తున్న ప్రతి స్కూల్, కాలేజిల్లో పనిచేసే ఉపాధ్యాయులు ట్యూషన్లు చెప్పడం నిషేధించాలి. వెనుకబడి వున్న విద్యార్థుల తెలివి పదును పెట్టేందుకు ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం ఉపాధ్యాయులే విధిగా కళాశాలలో ప్రత్యేక కోచింగ్ ఇచ్చే పద్ధతి ప్రవేశ పెట్టాలి. దీనికి నామ మాత్రం ఫీజు వసూలు చేయాలి, లేకుంటే మధ్య తరగతియులు ఈ ట్యూషన్ ఫీజులను భరించలేరు.

నెల్లూరు -వి.ప్రశాంత్‌కుమార్

### స్వేచ్ఛావిపంచి బాగుంది

స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకొని విజయ వాడ ఆకాశవాణి కేంద్రం వాళ్లు 11 తేది టౌన్‌హాల్‌లో ఏర్పాటు చేసిన స్వేచ్ఛా విపంచి కవి సమ్మేళనం సక్సెస్ అయింది. సినిమా యాక్టర్లు, డాన్స్ ప్రోగ్రామ్స్ లేకుండా జరిగిన కార్యక్రమానికి టౌన్‌హాల్ కిటకిట లాడిపోయింది. కవుల కవితా గానానికి ప్రజలు పరవశించి పోయారు. ముఖ్యంగా ద్విశతావధాని నాగఫణిశర్మ, బేతవోలు రామబ్రహ్మం, వేణుగోపాల రెడ్డి కవితలు శ్రోతల ఆలోచనలకు పదును పెట్టాయి. గుంటూరు రేంజ్ డిఐజి భాస్ తేటతియ్యని తెలుగు ప్రసంగం కార్యక్రమానికి అదనపు ఆకర్షణ. రేడియో రికార్డింగ్‌ను థియేటర్ నుంచి నడివీధికి తెచ్చి రక్తి కట్టించిన స్టేషన్ డైరక్టర్ పద్మనాభ రావుకు అభినందనలు.

నెల్లూరు -జె.పోలిరెడ్డి

### రక్తాక్షరాలతో వ్రాయడం ఏమిటి?

ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు ఎప్పుడు ఏ విషయం మాట్లాడు తారో అర్థం కాదు. కొన్ని పార్లు వీధి నేతల స్థాయిలో వుంటాయి ఆయన ప్రకటనలు. ఇటీవల అటువంటి ప్రకటన ఒకటి చేసారు. నేషనల్ ఫ్రంట్ అధికారంలోకి వస్తే రక్తాక్షరాలతో రాజ్యాంగాన్ని తిరిగి వ్రాయిస్తా నన్నారు. అంటే కొత్త రాజ్యాంగం బలి కోరుతుందని అర్థమా? ఇప్పుడున్న రాజ్యాంగం మొత్తం పనికి రాదని వుద్దేశమా? ఏమీ అర్థం కావడం లేదు. అసలు ఎన్టీఆర్‌కు నిలకడ

కొనసా 8 పేజీలో

## మహిళా కాంగ్రెస్ నిరసన

# ఆడవాళ్ళే నయమన్పించారు!

మహిళలు తలచు కొంటే ఏ పనినైనా విజయ వంతంగా చేసి చూపించ గలరని టౌన్ మహిళా కాంగ్రెస్ చాటి చెప్పింది. 21 తేది ఆర్టీసి, విద్యుత్ ఛార్జీలు పెంచి నందుకు నిరసనగా టౌన్ మహిళా కాంగ్రెస్ నాయకురాలు

### నెల్లూరు సంగతులు

పందిళ్లపల్లి అరుణమ్మ నాయకత్వంలో నిర్వహించిన కార్యక్రమానికి సామాన్య, మధ్య తరగతి గృహిణులు పలువురు కలెక్టరేట్‌కు తరలి వచ్చారు. ఇందిరా భవన్ నుండి ప్రదర్శనగా బయలు దేరి గాంధీ బొమ్మ మీదుగా వి.ఆర్.సి. సెంటర్‌ను చేరుకొన్నారు. అక్కడ మానవ హారంగా నిలబడి 15 నిముషాల పాటు ట్రాఫిక్‌ను స్తంభింప జేశారు. అనంతరం కలెక్టరేట్ వద్దకు ఊరేగింపుగా చేరుకొని ధర్నా నిర్వహించారు. శిబిరంలో పాల్గొన్న జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి మాట్లాడుతూ కాంగ్రెస్ పార్టీలో విభేదాలు లేవని, పార్లమెంట్ ఎన్నికల్లో పార్టీ విజయం సాధిస్తుందన్నారు. పందిళ్లపల్లి అరుణమ్మ మాట్లాడుతూ తెలుగు దేశం ప్రభుత్వం అన్నింటా విఫల మయ్యిందన్నారు. మధ్య తరగతి ప్రజలు కొలుకోలేని విధంగా నిత్యావసర వస్తువుల ధరలు, విద్యుత్, ఆర్టీసి ఛార్జీలు పెంచినట్లు ఆరోపించారు. మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి కూడా శిబిరాన్ని సందర్శించి టౌన్ మహిళా కాంగ్రెస్ కార్యకర్తలను

కొరవ 11 పేజీలో



21 తేది విద్యుత్ ఆర్టీసి ఛార్జీల పెంపు దలకు నిరసనగా కలెక్టర్‌కు మెమోరాండం సమర్పిస్తున్న టౌన్ మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ, జిల్లా మహిళా కాంగ్రెస్ ఉపాధ్యక్షురాలు బివి లక్ష్మి, మహిళలకు తోడుగా వచ్చిన మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి.



నెల్లూరులో గీతాజ్ఞాన యజ్ఞం ప్రారంభిస్తున్న స్వామిని శిలానంద; ప్రక్కన కొండా బలరామరెడ్డి.

## కందిపప్పు కిలో 42 రూపాయలు

# ఎన్టీఆర్ ప్రభుత్వం ఏమి చేస్తున్నట్లు?

ఆర్టీసి, విద్యుత్ సంస్థలకు నష్టాలు లేక పోయినా ఖాళీ అయిన రాష్ట్ర ఖజానా నింపుకునేందుకు ప్రజల పై ఎన్టీ రామారావు అదనపు భారాన్ని రుద్దినట్లు మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధన రెడ్డి ఆరోపించారు. 22 తేది ఇందిరా భవన్‌లో పత్రికల వారితో మాట్లాడుతూ ఆర్టీసి బ్రహ్మాండంగా నడుస్తున్నదని కేంద్ర ప్రభుత్వం కూడా కితాబిచ్చిందని; అయితే ఎన్టీఆర్ డీజల్ రేట్లు పెరిగాయని పచ్చి అబద్ధాలు చెబుతున్నా డన్నారు. విద్యుత్, ఆర్టీసి ఛార్జీలు తన అసమర్ధత వల్లే పెంచాల్సి వచ్చిందని ప్రజల ముందు ఎన్టీఆర్ ఒప్పుకొని తీరాలని జనార్ధన రెడ్డి డిమాండ్ చేశారు. కందిపప్పు కేజి 42 రూపాయ లయ్యింది; సివిల్ సప్లైస్ శాఖ ఏం చేస్తున్నదో తెలియదు. అదే తాను ముఖ్యమంత్రిగా వుండగా హైదరాబాద్ మార్కెట్‌లో కూరగాయల రేట్లు పెరిగితే వెంటనే అదుపు చేసినట్లు వివరించా రాయన. రెండు రూపాయల కిలో బియ్యం, సారా నిషేధాలను కుంటి సాకులుగా చూపిస్తున్న ఎన్టీఆర్ వాస్తవ రూపాన్ని ప్రజలు గమనించా లన్నారు. ప్రజల డబ్బు కోట్ల రూపాయలు ప్రజా సదస్సుల పేరిట తగలేస్తూ పార్లమెంట్ ఎన్నికల ప్రచారం చేసు కొంటున్నారు.

### జనార్ధనరెడ్డి ప్రశ్నిస్తున్నాడు

నేషనల్ ఫ్రంట్ అధికారంలోకి వస్తే రాష్ట్రంలోని తన అసమర్ధత పాలన దేశానికంతా విస్తరింప జేస్తాడట. అసలు నేషనల్ ఫ్రంటే ఒక స్టంట్. అదో టెంట్; ఎవరు ఏ కొయ్య తెస్తారో తెలియని అగమ్య గోచర స్థితి వుందని చెప్పారు. రామారావు చేతగాని ప్రయోగాల వల్ల రెవిన్యూ వ్యవస్థ కుప్పకూలి పోయిందని, దాన్ని దారిలో తెచ్చేందుకు గత కాంగ్రెస్ ప్రభుత్వానికి ఐదు సంవత్సరాల కాలం వెచ్చించ వలసి వచ్చిందన్నారు. న్యాయ పంచాయితీలు తలాతోక లేని బిల్లు; పసుపు చొక్కాలు వేసుకొన్న వాళ్లను జడ్జీలుగా కూర్చోబెట్టి కాంగ్రెస్ వాళ్లను తిప్పలు పెట్టనే ఈ పని ప్రారంభించారు. న్యాయ వ్యవస్థ పై గౌరవం గల ప్రతి ఒక్కరూ ఈ విషయాన్ని ఖండించాలన్నారు.

### పార్లమెంటు ఎన్నికల్లో అనుకూల ఫలితాలు!

పార్లమెంటు ఎన్నికల్లో ఇప్పటి వరకు పోటీ చేసే ఆలోచన లేదని; కాని తానెప్పుడూ అధిష్టాన వర్గం నిర్ణయాన్ని

కొరవ 10 పేజీలో

# అప్పుతెచ్చి, అంగడి గదులు కట్టి టౌన్ అభివృద్ధి!

నెల్లూరు మునిసి పాలిటీ ఆర్థిక సంక్షోభంలో కొట్టు మిట్టాడుతున్న సంగతి కౌన్సిలర్లందరికీ తెలుసు. కేవలం 12 లక్షల రూపాయల మిగులు మాత్రమే మునిసిపాలిటీ ఖజానాలో నిల్వ వుండిప్పుడు; వుద్యోగులకు జీతాలు కూడా చెల్లించలేని దుస్థితి నెలకొని వుంది. కాని ఆర్థిక వనరులు పెంపొందించే విషయమై సభ్యుల సూచనలు స్వీకరించాలని అధికారులు పడుతున్న తాపత్రయం గత రెండు సమావేశాలుగా వృధా అయి పోతూవుంది. మీటింగ్‌లో ఏదో ఒకటి మాట్లాడి పత్రికల్లో పేరు చదువు కోవాలనే తాపత్రయం తప్ప చాలా భాగం కౌన్సిలర్లలో ప్రజా సమస్యలు పరిష్కరించే విషయంలో శ్రద్ధ, ఆసక్తి కన్పడడం లేదు. 21 తేది జరిగిన మునిసిపల్ సమావేశంలోనూ అంతే; మీటింగు ముగియక మునుపే 27 మంది కౌన్సిలర్లు తమ సీట్లను వదలి ఇళ్లకు వెళ్లిపోయారు. దీనివల్ల అసలు సమస్య అయిన డబ్బు కొరతతో పాటు సమావేశంలోని ఇతర ముఖ్య అంశాలైన కంపోస్టు యార్డు తరలింపు, పట్టణ పారిశుధ్యం అభివృద్ధి పరిచే విషయాలపై చర్చ జరగనే లేదు. ఆర్థిక వనరుల గురించి సీరియస్‌గా ఆలోచనే చేయలేదు.

### పార్కులను షాపింగ్ కాంప్లెక్సులు చేస్తా!

ఆర్థిక వనరులు పెంచు కోవడానికి మునిసి పాలిటీ తనంతట తానుగా మార్గాలు వెదకక తప్పేట్లు లేదని; కేవలం పన్నుల పైన, ప్రభుత్వ గ్రాంటుల పైన ఆధార పడితే ఏమీ చేయలేమని అర్థమైందని ఛైర్మన్ వివేకానంద రెడ్డి అన్నారు. భూగర్భ డ్రైనేజి విస్తరణ, టౌన్‌లోని అన్ని ప్రాంతాలలో విద్యుదీకరణ జరగాలంటే కోట్లు ఖర్చు పెట్టాలి. అదనంగా నిధులు తెచ్చుకొంటేనే అది సాధ్యం. అందువల్ల వప్పుల వీధిలో నిరుప యోగంగా వున్న పార్కు, టి.వి.ఎస్. హైస్కూల్ ముందున్న, ఖాళీ స్థలం, మహబూబ్ ఖాన్ పార్కులను షాపింగ్ కాంప్లెక్సులుగా తీర్చి దిద్ది, నిధుల సేకరణ జరప నున్నట్లు ఛైర్మన్ వివరించారు. విజయ వాడ, కాకినాడ కార్పొరేషన్లు తీసుకొన్నట్లు హడ్కో, ఎల్.ఐ.సి. వంటి సంస్థల నుండి రుణాలు తీసుకొని టౌన్‌ని అభివృద్ధి పరచాలన్న మరో ఆలోచన కూడా బయట పెట్టారాయన. ఈ ఏడాది మునిసిపల్ పన్నులు 95 శాతం వసూలు కాగానే శివారు ప్రాంతాల్లోని వార్డులకు ఒక్కొక్క దానికి 3 లక్షలు, మిగిలిన వార్డులకు 1.5 లక్షలు మంజూరు చేస్తానన్నారు. గత మూడు సంవత్సరాలుగా అధికారుల పాలనలో పలు అవక తవకలు జరిగి నందువల్ల కోటి 30 లక్షల మేర విద్యుత్ బకాయిలు పేరబడి పోయాయట. మునిసిపాలిటీకి గత ఏడాది వచ్చిన 5 కోట్ల రూపాయల్లో 3 కోట్లు జీతాలకు పోయినా, మిగతా రెండు కోట్ల మిగులు ఏమయ్యిందన్న కౌన్సిలర్ల ప్రశ్నలకు అధికారుల నుండి సరైన సమాధానం రాలేదు. గతంలో ఆదాయానికి మించిన ప్రతిపాదనలు - పనుల వల్ల ఈ స్థితి నెలకొన్నదన్న కమీషనర్ వివరణ వారిని సంతృప్తి పరచలేదు. తాము వేసే సూటి ప్రశ్నలకు కమీషనర్ సుదీర్ఘ డొంక తిరుగుడు సమాధా నాలివ్వడంతో పలువురు కౌన్సిలర్లు విసుగెత్తి పోయి; కమీషనర్ భాష తమకు అర్థం కావడం లేదని వాపోయారు. మునిసిపల్ ఇంజనీరింగ్ శాఖ పర్యవేక్షణలో ఎద్దలరేవు సంఘం వద్ద నడుస్తున్న

కొరవ 10 పేజీలో

> ఖజానాలో చిల్లి గవ్వలేదు; నిధులెట్లా తేవాలో ఆలోచనలేదు; కౌన్సిలర్లకు పత్రికల్లో పేరు; పై తాపత్రయం; అధికారులు చెప్పేదేంటో వారికే అర్ధం కాదు; వెరసి మునిసిపల్ కౌన్సిల్ సమావేశాలు ఫార్సుగా తయారౌతున్నాయి!



గూడూరు రోటరీ క్లబ్ నిర్వహించిన ఆటల పోటీల్లో ఛాంపియన్‌గా వచ్చిన విద్యార్థికి బహుమతి ప్రదానం చేస్తున్న మున్సిఫ్ మెజిస్ట్రేట్ జి. పార్థసారథి.

# పడవలు పాడుబడ్డాయి - పథకం మూలపడింది

మత్స్య కారుల అభివృద్ధి కోసం ప్రభుత్వం ప్రవేశ పెట్టిన 'పైలట్ స్కీం' పథకం నేడు సిబ్బంది కొరతతో, ఇచ్చిన రుణాలు సరిగా వసూలు కాక పోవడంతో సంక్షోభంలో పడిపోయింది.

1987 అక్టోబర్ నెలలో అప్పటి ముఖ్య మంత్రి ఎన్టీ రామారావు ప్రారంభించిన ఈ పథకంలో నెల్లూరు, ఒంగోలు జిల్లాలలోని తీర ప్రాంతాలను 11 సొసైటీలుగా విభజించి, 1245 మంది మత్స్య కారులకు మొదటి విడతగా ఒక కోటి 80 లక్షల రూపాయలు విడుదల చేశారు. వీటితో ఒక్కొక్కటి లక్ష రూపాయలు విలువ చేసె 34 మర బోట్లను మత్స్య కారులకు అందచేశారు. ప్రతి పడవకు 30 వేల రూపాయలు విలువ చేసే వలలను కూడా సమకూర్చారు. అయితే తీసుకున్న రుణాలను మత్స్యకారులు సరిగా చెల్లించక పోవడంతో పథకం కొరకు అదనంగా కేటాయించిన 8 కోట్ల రూపాయలను ప్రభుత్వం విడుదల చేయకుండా నిలిపి వేసింది.

మత్స్య కారులు పట్టిన చేపలు, రొయ్యలు దళారుల పాలవు తున్నాయని భావించి దానిని నివారించేందుకు ప్రభుత్వం మత్స్య కారుల అభివృద్ధి శాఖ ద్వారా విక్రయం జరిగే విధంగా ఏర్పాటు చేసింది. అయితే మత్స్య కారులు తెలివిగా చేపలు, రొయ్యలను ఓపెన్ మార్కెట్‌లో అమ్ముకొంటూ, తీసుకున్న రుణాలను సరిగా చెల్లించటం మానేశారు. అప్పటి వరకు కేవలం 33 లక్షల రూపాయలు మాత్రమే అధికారులు మత్స్య కారుల నుండి రాబట్ట గల్గారు. లబ్ధి దారులను దారిలోనికి తెచ్చేందుకు చివరి యత్నంగా అధికారులు తామిచ్చిన మర పడవల్లో 22 పడవలను ఇటీవల స్వాధీనం చేసుకున్నారు. వీటిలో కొన్నింటిని మత్స్య కారులు దబాయించి తిరిగి వాడుకొంటూనే కొంటునే వున్నారు. వలలు మటుకు ఎవరూ తిరిగి ఇచ్చిన పాపాన పోలేదు. పడవలను చిప్పలేరు వాగులో వుంచడంతో అవి ఎందుకూ పనికి రాకుండా పోయాయి. రెండు నెలల్లో వీటిని వేలం వేస్తామని అధికారులు చెబుతున్నారు. అదీ గాక మత్స్య కారులు పట్టిన చేపలను స్టోరేజి చేసు కోవడానికి వీలుగా 23 లక్షల రూపాయల విలువతో మద్దూరు పాడు వద్ద నిర్మించిన ఐస్ ఫ్యాక్టరీ సిబ్బంది కొరతతో అల్లాడు తోంది. ఐస్ ఫ్యాక్టరిలో రోజుకు 10 టన్నుల ఐసను సప్లయి

కొరవ 8 పేజీలో

## జిల్లావార్తలు జిల్లావార్తలు జిల్లావార్తలు

### పోలీసులే కోడిపుంజుల దొంగలు?

20 తేది గూడూరు పోలీసు స్టేషన్ల పరిధిలోని పోలీసుల ఇళ్లు పలావు వాసనలతో ఘుమ ఘుమ లాడి పోయాయి. గూడూరు వన్ టౌన్, టూ టౌన్, రూరల్ పోలీస స్టేషన్లకు చెందిన 25 మంది కానిస్టేబిళ్లు లుంగీలు, ముతక చొక్కాలు, తల పాగాలు చుట్టుకొని లారీలో చెన్నూరు చెరువు వద్దకు వెళ్లారు. కోడి పందాలు ఆడుతున్న వారి పై మూకుమ్మడి దాడి చేశారు. వారిలో 32 మందిని అరెస్టు చేసి 42 బరిస పుంజులతో పాటు 3,900 రూపాయలను స్వాధీనం చేసుకొన్నారు. కాని సోమ వారం కోర్టులో కేవలం 24 పుంజులను మాత్రమే హాజరు పెట్టారు. మిగతా 18 పుంజులతో పలావు చేసుకొని పోలీసులు పండగ చేసుకొన్నట్లు తెలిసింది. స్వాధీనం చేసుకొన్న పందెపు కోళ్లను కోర్టు వద్ద వేలం వేయగా యజమానులు తెలివిగా తక్కువ రేట్లకు కొనుక్కున్నారు. పోలీసులు ఆదివారం పలావు కోసమే ఈ ఘనకార్యం చేసినా, పందెపు కోళ్ల దారులకు కాసింత భయం కూడా ఏర్పడింది.

### గూడూరులో రాజీవ్ జన్మదినం

మాజీ ప్రధాని స్వర్గీయ రాజీవ్ గాంధీ జన్మ దినోత్సవాన్ని గూడూరులో యువజన కాంగ్రెస్ ఘనంగా జరిపింది. యువజన కాంగ్రెస్ నాయకులు పండ్లు, పాలు, రొట్టెలను ప్రభుత్వ ఆసుపత్రిలోని రోగులకు పంచి పెట్టారు. కార్యక్రమంలో జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి ఎల్లసిరి గోపాల రెడ్డి, కోడూరు మీరా రెడ్డి, దగ్గవోలు సురేంద్ర తదితరులు పాల్గొన్నారు.

### విద్యుత్తు వైర్లను మార్చండి

తోటపల్లి గూడూరు మండలం కోడూరు సబ్ స్టేషన్ పరిధిలో విద్యుత్ లైన్లు వేసి 30 ఏళ్లు దాటింది. అవి తుప్పు పట్టి ప్రస్తుతం దుస్థితిలో వున్నాయి. ఇప్పుడు కురుస్తున్న తొలకరి జల్లులతో వీచే గాలులకు తీగలు పలు చోట్ల తెగ పడి పోతున్నాయి. విద్యుత్ శాఖాధి కారులు తగిన చర్య తీసుకొని పాత విద్యుత్ వైర్ల స్థానే కొత్త వాటిని వేయాలని ప్రజలు కోరుతున్నారు.

### జల్సా చేసి దొరికిపోయిన కరెంట్ దొంగలు

ఫ్యూజ్ వైర్లను తీసివేసి పొలాల్లో కరెంట్ తీగలను గుట్టు చప్పుడు కాకుండా కత్తిరించి వేసే ముఠా ఆటను గూడూరు పోలీసులు కట్టించారు. ఇక్కడి వలయు నందపురం, రాణీపేటలకు చెందిన మురుగేశ్ (20), పురుషోత్తం (20), పరమేశం (18) విచ్చల విడిగా తిరుగుతూ, జల్సాగా డబ్బు ఖర్చు పెడుతూ పోలీసుల కంట పడ్డారు. అనుమానం వచ్చి పై నిఘా వుంచడంతో తెలికగానే వీరి బండారం బయట పడ్డట్లు గూడూరు టూ టౌన్ ఎస్ఐ కె. వెంకట్రామి రెడ్డి చెప్పారు. వీరి వద్ద నుంచి ఇటీవల చింత వరం, కేసవరం, చెట్టేరు, మద్దాలి, మడమనూరు గ్రామాల్లో దొంగలించిన లక్షా 75 వేల రూపాయల విలువ చేసే కరెంట్ తీగలు స్వాధీనం చేసుకొన్నారు. వెంకట్రామి రెడ్డి గతంలో కిలో బంగారం స్వాధీనం చేసుకొని రికవరీల ఎస్ఐగా పేరు పొందారు.



## ఉత్తరక్రియలు



మా అభివృద్ధికి కారకులు

# పూనూరు రామసుబ్బారెడ్డి గారు

14.8.95 తేది సోమవారం రాత్రి స్వర్గస్థులైనారు.

వారి ఉత్తరక్రియలు

| | | |
|---|---|---|
| 30.8.95 తేది | బుధవారం | శిలాప్రతిష్ఠ |
| 31.8.95 తేది | గురువారం | బ్రాహ్మణబియ్యాలు |

వెంకన్నపాళెం గ్రామం, మనుబోలు మండలంలో మా స్వగృహమున జరుగును.
బంధుమిత్రులు తెలియగోరుతాము.

భార్య: అనసూయమ్మ

కుమార్తెలు - అల్లుళ్లు : లెక్కల సుజాత - ప్రభాకరరెడ్డి
అనుమారెడ్డి ఇందిర - చంద్రశేఖరరెడ్డి, వేమిరెడ్డి అరుణ - జానకిరామిరెడ్డి
తిరువూరి విజేత - ప్రసాద్‌రెడ్డి మనుమలు, మనుమరాళ్లు

# నెల్లూరు కబుర్లు

విహార్యకుడు

### జనార్దనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ ఎన్. జనార్దన రెడ్డి 21 తేది నెల్లూరు వచ్చారు; 24 తేది వరకు జిల్లాలోనే వుంటారు.

### కరెంట్‌శాపం

నెల్లూరు జిల్లాను కరెంట్ శాపం ఇంకా పట్టి పీడిస్తూనే వుంది. ఒక వైపు వానలు పెల్లుబగా కురుస్తూనే వున్నా చీకటి నరకం తప్పడం లేదు. ఉదయం సాయంత్రం పవర్ కట్ యధా ప్రకారం కొనసాగిస్తూనే వున్నారు. మధ్య మధ్యలో చెప్పా పెట్టకుండా తీసి పారేస్తున్నారు. కరెంట్ రాకడ, పోకడలను వూహించడం ఆ దేముడి తరం కూడా అయ్యేట్లు లేదు. పల్లెటూళ్ల పరిస్థితి మరీ దారుణం. వానలు కరుణించి చెరువుల్లో, కాలువల్లో కొద్ది గొప్పో నీళ్లుంటున్నాయి కాబట్టి సరిపోయింది కాని లేకుంటే రైతులు నరక యాతన పడివుండే వారు. ఏ జన్మలో చేసుకున్న పాపమో, తెలుగు ప్రజలనిట్లా కట్టి కుదుపు తున్నది. దీనికి నిష్కృతి ఎప్పుడో మరి!

### వినాయకచవితి చందాల బెడద

దసరా మామూళ్లను మించి పోయింది వినాయక చవితి దందకాల బెడద. పది మంది కలవడం ఒక కరపత్రం అచ్చేసుకుని ఇళ్లపైన, అంగళ్ల పైన పడడం; దబాయించి దండడం అలవాటై పోయింది. వీధికి ఇద్దరు ముగ్గురు వినాయకుళ్లు వెలుస్తున్నారు.

దేముణ్ని పూజించడానికి జనాన్ని పీడించే సాంప్రదాయం ఎక్కడి నుంచి వచ్చిందో కాని, మధ్య తరగతి కుటుంబాలకు ఇది పెద్ద పీడగా పరిణమిస్తున్నది. ఎంత మందికని ఇస్తారు, ఎంతని ఇస్తారు? దానికి ఒక పద్ధతి, పాడు వుండ నవసరం లేదా? పోలీసులు ఈ దందకాల వీరులను అదుపు చేయలేరా?

### సెప్టెంబర్ 5 వరకు చెరకు క్రషింగ్

కోవూరు చక్కెర ఫ్యాక్టరీలో చెరకు క్రషింగ్ సెప్టెంబర్ 5 తేది వరకు పొడిగించాలని నిర్ణయించారు. ఇప్పటికి 3.25 లక్షల టన్నుల చెరకు ఆడించారు; ఇంకా 20 వేల టన్నుల వరకు మిగిలి వుంది. కనీసం 15 రోజుల పాటైనా ఫ్యాక్టరీని నడపనిదే దీన్ని పూర్తి చేయడం కుదరదు. ఎప్పుడో జూలైలో ప్రారంభించాల్సిన క్రషింగ్ సెప్టెంబర్‌లోనూ కొనసాగించ వలసి రావడం నిజంగా రైతుల దురదృష్టమే. పంట కాలం పొడిగింప బడే కొద్ది వాతావరణ ప్రభావం వల్ల దిగుబడి తగ్గుతుంది. రెటూన్ క్రాప్ ఫెయిలౌతుంది. చెరకు కొట్టి వేసి, కొత్తగా విత్తనం నాట వలసిన తోటలకు అదును దాటి పోతుంది. రైతులు అన్ని విధాలా నష్ట పోతున్నారు. ఇంకొక యేడాది ఫ్యాక్టరీ ఇటువంటి అధ్వాన్న పరిస్థితులలోనే నడిస్తే నష్టాలతో దివాలా తీస్తుంది. రైతులు చెరకు మానేసి ఇతర పంటలు వేసుకోవలసి వస్తుంది. దివాలా తీసి వుండిన ఫ్యాక్టరీని సామంతు సుబ్బారెడ్డి గారు తన అబ్బది పోయినట్లు ప్రాకులాడి లాభాల్లో పెట్టారు. రాత్రింబవళ్లు పని చేసి రైతులకు మేలు చేశారు. ఐదేళ్లు ఆయన పడిన కష్టం ఐదంటే ఐదు నెలల్లో బూడిదలో పోసిన పన్నీరైంది. చక్కెర మంత్రిగా ప్రసన్న కుమార రెడ్డి వ్యవహరించిన తీరే ఈ దీనావస్థకు కారణం. ఆయన ఇప్పటికైనా తన తప్పు తెలుసు కున్నాడో లేదో మరి!

### నెల్లూరు ఎస్ఇకి ఢిల్లీ అవార్డు

నెల్లూరులో తెలుగు గంగ సూపరిం టెండింగ్ ఇంజనీరుగా వున్న శ్రీ పి.కె. మనోరంజన్ ఢిల్లీ అవార్డు సాధించాడు. కేంద్ర ప్రభుత్వం ప్రదానం చేసే ప్రతిష్టాత్మకమైన రాజీవ్ గాంధీ ఎక్సలెన్స్ అవార్డు ఆయనకు లభించింది. 20 తేది ఢిల్లీలో కేంద్ర మంత్రి శ్రీమతి మార్గరెట్ ఆల్వా ద్వారా ఆయన అవార్డు అందుకొన్నారు.

1977 లో వచ్చిన పెను తుఫాన్‌లో పూర్తిగా దెబ్బతిన్న నీటి పారుదల వ్యవస్థను పునరుద్ధరించడం, విశాఖ ఉక్కు ఫ్యాక్టరీకి నీటి సరఫరా ఏర్పాట్లలో చేసిన ప్రశంసాత్మమైన కృషి వంటివి అయన్నీ అవార్డుకు అర్హం చేశాయి.

### వైటి పార్వతి భక్తి

సింహపురి రీజియన్ ఆర్‌టిసి ఛైర్మన్ శ్రీ వై.టి. నాయుడు ఈ రోజు (25 తేది) ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టి తను ఇప్పటికీ, ఎప్పటికీ లక్ష్మిపార్వతి భక్తుడనేనని ప్రకటించారు. అక్కడ హైదరాబాదులో అన్నా వదినలు ఆపదలో పడిపోయారని వారి పదవి సందేహంలో పడిందని తెలిసినా, తనను గుర్తించి మునిసిపల్ ఛైర్మన్ టిక్కెట్, ఆర్‌టిసి పదవి ఇచ్చినందుకు కృతజ్ఞతగా తాను వారితోనే వుంటున్నట్లు ప్రకటించాడు వైటి.

ఎటు గాలి కొడితే అటు తెర చాప ఎత్తి, గెల్చె గుర్రం పైనే పందెం కాసే తెలుగు దేశం రాజకీయ [illegible] పాత్రత ప్రదర్శించడం అభినందనీయం. అధికారం యావత్ కప్పల తక్కెడ సామెతగా వ్యవహరించ కుండా, నిలకడ నిజాయితీ చూపిన వైటిని అభినందిస్తాం!

### నరసింహకొండపై పిడుగు పడింది!

నరసింహ కొండ శ్రీలక్ష్మి నరసింహ స్వామి ఆలయ ఆవరణంలో 19తేది సాయంత్రం పిడుగు పడింది. సత్రం పై పడిందట- దాని క్రింద కూర్చొని వుండిన నలుగురు భక్తులు - శేఖర్, పెంచలయ్య, నారాయణ, రాజమ్మలకు గాయాలైనాయి.

చంద్రబాబు
7 పేజీ కొరవ

తెలిసిన నాయకుడు. అధికారులతో సత్సం బంధాలున్నాయి. పరిపాలన తెలిసిన వాడు. గత ఏడేళ్ల తెలుగు దేశం హయాంలో ప్రతి ఫైలు కదలిక వెనుకా చంద్రబాబు పాత్ర వుంది. ఛట్టాలు, నిబంధనలు క్షుణ్ణంగా తెలుసు. చంద్రబాబు ముఖ్యమంత్రి అయితే పరిపాలన సమర్థ వంతంగా వుంటుందనే ఆశించాలి.

* * *

గవర్నర్ చంద్రబాబును ప్రభుత్వ పెత్తనానికి ఆహ్వానిస్తారా లేక ఎన్టీఆర్ కోరినట్లు అసెంబ్లీ రద్దుకు సమ్మతిస్తారా అన్నది ప్రశ్న. కానీ సంఖ్యాబలం వుంది కాబట్టి చంద్రబాబు పదవీ స్వీకారమే [illegible] తుందని భావించాలి. అసెంబ్లీ రద్దు జరిగితే రాష్ట్రపతి పాలనే శరణ్యం. అది కాంగ్రెస్‌కు అనుకూలం. గవర్నర్ అటువంటి నిర్ణయం తీసుకొంటాడని భావించలేము.

* * *

చంద్రబాబు శిబిర నిర్వహణలో నెల్లూరు నాయకుల పాత్ర చాలా వుంది. దేగా నారసింహా రెడ్డి గారు ఎమ్మెల్యేల సౌకర్యాలు చూసే బాధ్యత స్వీకరించారు. ఆయన ప్రతి ఎమ్మెల్యేనూ కలిసి, ఏమి కావాలో అడిగి, వెంటనే సమకూరుస్తున్నారు. రమేష్ రెడ్డి, సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి లిద్దరూ చాలా చురుకైన పాత్ర పోషిస్తున్నారు. చంద్ర మోహన రెడ్డికి, మామ ఎన్‌సి నుంచి ఫోన్ వచ్చిందట - ఆ క్యాంపులో వద్దు, ఎన్టీఆర్ గూటిలో కూర్చుందాం రమ్మని! కాని చంద్ర మోహన రెడ్డి విన్పించు కోలేదు.

చంద్రబాబు క్యాంప్ నడుస్తున్న వైస్రాయ్ హోటల్ కూడా నెల్లూరీయులది కావడం గమనార్హం. బాబుల్ రెడ్డి కుమారుడు ప్రభాకర రెడ్డి; స్వర్గీయ దేగా సుందర రామరెడ్డి కుమారుడు దేగా శ్రీనివాసులు రెడ్డి ఈ హోటల్ యజమానులు.

* * *

రేపు (26 తేది) చంద్రబాబు ప్రమాణ స్వీకారం సమయంలో నెల్లూరు జిల్లాకు సంబంధించి మంత్రి ఎవరన్నది ఆలోచిస్తే రమేషరెడ్డికే ఛాన్సు తగుల్తుందని భావించాలి. చంద్ర మోహన్ రెడ్డికి కూడా ఆశ వుంది కాని, నమ్మకంగా చెప్పలేము.

# చంద్రబాబే ముఖ్యమంత్రి- ఎన్టీఆర్ అసెంబ్లీ రద్దు కోరిక తీరదు!

వరకు వారు ఎనిమిది మంది ఎమ్మెల్యేల సస్పెన్షన్ ఉప సంహరణ, మంత్రి మాధవ రెడ్డి పై క్రమశిక్షణా చర్యలు మాను కోవడం అనే రెండు అంశాల పైనే మాట్లాడుతుంది వారు. ఎప్పుడైతే ఎన్టీఆర్-

**మొదటి పేజీ కొరవ**

లక్ష్మీపార్వతి కాళ్ల దగ్గర పడి వుండండి- అన్న ధోరణిలో పెడసరంగా హెచ్చరించారో, ఆ క్షణంలో వారి ఆలోచనలు మారి పోయాయి. తిరుగు బాటు ధ్వజం పైకెత్తారు. పరిస్థితి అదుపు తప్పింది.

ఈ దశలో ఎన్టీఆర్ కుమారులు హరికృష్ణ, బాలకృష్ణలు రంగ ప్రవేశం చేశారు - తండ్రితో వాదులాటకు దిగారు. బావ, చంద్రబాబును విప్లవ నాయకత్వం స్వీకరించ మన్నారు. కొడుకులు ఎంత గట్టిగా చెప్పినా ఎన్టీఆర్ మూర్ఖత్వం మారలేదు. అర్థాంగి పై అరవరాని ప్రేమ ఆయన జ్ఞాన చక్షువులను మూసి పారేసింది. పెద్దల్లుడు ఢిల్లీ నుంచి పరుగు పరుగున వచ్చి మామకు నచ్చ చెప్పడానికి యత్నించాడు. కానీ ఫలితం లేదు. ఎన్టీఆర్ మరింత బిగుసుకు పోయాడు. ఇద్దరూ తెగిందాకా తాడును పట్టి లాగారు. అది పుటుక్కున తెగి పడింది. తెలుగు సైకిల్ చక్రం బరస్ట్ అయింది. పార్టీ నిట్ట నిలువునా చీలింది. ముగ్గురు కొడుకులు - హరికృష్ణ, బాలకృష్ణ, రామకృష్ణలు తండ్రితో తెగతెంపులు చేసుకొని బయట పడుకొని రాజకీయ ఆత్మహత్యకు పాల్పడినారు.

రామారావు ఏ మాత్రం సంయమనంతో వ్యవహరించి వుండినా పరిస్థితి ఇంత దూరం వచ్చి వుండేది కాదు. చంద్ర బాబుకు కాని, హరికృష్ణకు కాని, ఎమ్మెల్యేలకు కాని ఎన్టీ రామారావును దించాలన్న ఆలోచనే లేదు. ఆయనే తమ నాయకుడని వారు చివరి నిముషం వరకు ఘంటాపథంగా చెప్పారు. లక్ష్మీపార్వతి అనవసర జోక్యాన్నే వారు నిరసించింది. దాన్ని నిలవ మంటే ఎన్టీఆర్ ఒప్పుకోలేదు. ఆయన ఆ ఒక్క విషయంలో రాజీ పడి వుంటే సంక్షోభం టీ కప్పులో తుఫాన్ వలె సమసి పోయి వుండేది. ఇప్పుడా పరిస్థితి దాటి పోయింది.

చంద్రబాబాదులు గవర్నర్‌ను కలిసి నాయకత్వం తమదని చెప్పనున్నారని తెలి పోవడంతో ఎన్టీఆర్ ఈ రోజు (25 తేది) ఉదయం 6 గంటలకు మంత్రి వర్గ సమావేశం పెట్టి, అసెంబ్లీ ముఖ్య మంత్రిగా ప్రమాణ స్వీకారం చేస్తారు. బల నిరూపణలో అనుమానం లేదు. బ్యాంక్ బండ్ దగ్గర వైస్రాయ్ హోటల్‌లో ఇప్పటికి 150 మంది వరకు ఎమ్మెల్యే లున్నారు. ప్రభుత్వం ఏర్పాటుకు ఆ బలం చాలు. వీరిక్కడ క్యాంప్ పెడితే లక్ష్మి పార్వతి తమ ఎమ్మెల్యేలతో మరొక క్యాంప్ తెరిచింది. వారి దగ్గర 65 మంది వరకు వున్నారని అంచనా. కొత్తగా వచ్చే వారికి రేటు నిర్ణయింప బడింది ఎంత ఖరీదైనా రెడీ అన్నారట ఆమె.

## ప్రజాస్వామ్యాన్ని రక్షించండనే నినాదంతో రామారావు వీధుల్లోకి వస్తున్నా జనంలో పూర్వపు ప్రతిస్పందన లేదు. ఆయన దగర ఎమ్మెల్యేలూ నిలవడం లేదు!

రామారావు గారు మరొక ప్రక్క ప్రజాస్వామ్యాన్ని రక్షించం డంటూ వీధుల్లోకి వస్తున్నారు. అప్పుడే ఆయన లక్ష్మి పార్వతితో కలిసి నినాదాలు మొదలు పెట్టాడు. అయితే 1984 లో వలె ఇప్పుడు ఆయనకు ప్రజా మద్దతు లభించ గలదని భావించలేము. అప్పుడు నాదెండ్ల భాస్కర రావు కేవలం అధికారం కోసం వెన్ను పోటు పొడిచాడు. చంద్రబాబుతో వెళ్లి పోయారు మిగిలింది చాలా తరక మాత్రమే. వారు జిల్లా పర్యటనలేమి ఏర్పాటు చేయగలరు? అన్నిటి కంటే ముఖ్యం ఆనాడు బిజెపి, సిపిఎం, సిపిఐ పార్టీలు ఎన్టీఆర్‌ను భుజాన ఎక్కించుకొని మోసాయి. అందువల్ల బంద్‌లు, హర్తాళ్లు, ఉద్యమాలు వీలైనాయి. ఈనాడు వారు చంద్రబాబును సమర్థి స్తున్నారు. ఏ దృష్టితో చూసినా ఎన్టీఆర్ వీధుల లోకి వచ్చి కేకలు పెడితే ప్రయోజనం వుంటుందని భావించ లేము. అది కేవలం వృథా శ్రమ అవుతుంది.

ఈ వివాదానికి దూరంగా వుండడం ద్వారా కాంగ్రెస్ మంచి పనిచేసింది. చూస్తూ వినోదించడం తప్ప ఎటువంటి వ్యాఖ్య చేయవద్దని కాంగ్రెస్ వాదులకు ప్రధాని పివి సలహా ఇచ్చారు.

అసలు ఎన్టీఆర్ ఇంత దూరం ఎందుకు తెచ్చుకున్నా డన్నది ఎవరికీ అంతు బట్టని ప్రశ్న! కేవలం భార్య మీద ప్రేమతో తన ప్రాణం మీదకు తెచ్చు కోవడం ఆయన మూర్ఖత్వాన్ని సూచిస్తున్నది.

* * *

తిరుగుబాటుకు విరమం జరిగిన తర్వాత చంద్రబాబును ఏకగ్రీవ నాయకుడిగా ఎన్ను కోవడం విచిత్ర పరిణామం. దగ్గుబాటి వెంకటేశ్వర రావు దీనికి సమ్మతిస్తారని ఎవరూ ఊహించలేదు. వీరిద్దరూ తోడల్లులే అయినప్పటికీ గత పదేళ్లుగా

[illegible]

**రమేష్‌రెడ్డి**

[illegible]

తెలుగు దేశం తరపున హరికృష్ణ వర్గంలో నిలబడినవారి అయినవి తిరుగుబాట్ల నిర్ణయం ఈ గోదా అప్పట్లో రూపంలో కలిసి వచ్చింది. అందరి కంటే ముందు తిరుగుబాటు చేసిన వారిలో రమేష్ రెడ్డికి భవిష్యత్‌లో ప్రాధాన్యత వుంటుంది కదా? ఈ పరిణామం వూహించిందే. అందువల్లే పార్టీ నుంచి సస్పెండ్ చేసినప్పటికీ అది శిక్ష కానే కాదు, పదవిని భావించడం జరిగింది. సస్పెన్షన్‌కు భయపడి రమేష్ రెడ్డి లక్ష్మీపార్వతికి విధేయత ప్రకటించి వుంటే ఈ రోజు జమ్మా అయి పోయి వుండేవారు. ఆనాడు తెగించి నిలబడడంతో ఈ రోజు పంట పండింది. చంద్రబాబు ముఖ్య మంత్రిత్వం స్వీకరిస్తే తొలి క్యాబినెట్‌లోనే రమేష్ రెడ్డి పేరు వుంటుందన్నది నమ్మకంగా వేయదగిన అంచనా.

సర్వేపల్లి పంతులు నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డి ఈ మధ్య వరకు ఆయనకు చంద్రబాబుతో పేచీ లేదు. ఇటీవలనే, లక్ష్మి పార్వతి జోరు చూసి, పనులు చక్క బెట్టు కోవడం కోసం ఒక పక్షంలో సభ్యుడిగా గుర్తింపు పొందాడు. లక్ష్మి పార్వతిని కోటకు తీసుక వచ్చి, ఆహ్వానం చేసి, ఆమె రాజకీయ పోరాటంలో తాను సైనికుడిగా వుంటానని ఆవేశ పూరిత ప్రసంగాలు చేసి ఇరుక్క పోయాడు. రామారావు గద్దె దిగితే, ఆయన మంత్రిత్వం మూణ్నాళ్ల ముచ్చటే అవుతుంది.

### దేగా కూడా!

మాజీ జిల్లా ఛైర్మన్, రాష్ట్ర హౌసింగ్ బోర్డు ఛైర్మన్ శ్రీ దేగా నారసింహా రెడ్డి కూడా చంద్రబాబు శిబిరంలో తొలి అటెండెన్స్ వేసుకున్నాడు. ఇది వూహించిన పరిణామమే. లక్ష్మి పార్వతితో ఆయనకు మొదటి నుంచి పెద్దగా సాన్నిహిత్యం లేదు. చంద్రబాబు, దగ్గుపాటిలతోనే స్నేహం. అందువల్ల ఏ శిబిరంలో చేరాలనే సంశయానికి పెద్దగా తావు లేదు.

# బాలకృష్ణ వద్దన్నాడు; దగ్గుపాటికి బలం చాలలేదు!

పడడంతో ఎమ్మెల్యేలకు ఎక్కడ లేని ధైర్యం వచ్చింది. గోడ మీద పిల్లి వాటంగా వుండిన వారూ పంచ లెగబట్టి పరుగెత్తి చంద్ర బాబు పంచన చేరిపోయారు. సంఖ్య పెరిగి పోయింది. అదే సమయంలో ఎన్టీఆర్ ఇంట సంఖ్య తరిగి పోయింది. నిన్నటి వరకు లక్ష్మి పార్వతి కనుసన్నలలో తిరుగు తుండిన, ఆమె పైట కొంగు తగిలితే చాలు జన్మ ధన్యమైనట్లు భావిస్తుండిన వారంతా రాత్రికి రాత్రి ఆమెను తనడించి, ఆమె కళ్లలో పడకుండా దూరంగా పారిపోయారు. రాజకీయాలలో ఆత్మహత్యలు తప్ప, హత్యలు వుండ వంటారు. ఎన్టీఆర్ విషయంలో అదే జరిగింది. ఆయన తన మెడకు తానే ఉరి బిగించుకొని, తన గొయ్యి తానే తవ్వుకొని, తన వేలితోనే తన కళ్లను

రద్దుకు సిఫార్సు చేశాడు. కానీ చంద్రబాబు 154 మంది ఎమ్మెల్యేల సంతకాలతో గవర్నర్‌ను కలిసి మెజారిటీ తనదే నన్నారు. అయితే ఎమ్మెల్యేలను తాను గుర్తు పట్టలేను కాబట్టి, స్పీకర్ సమక్షంలో పెరేడ్ చేయించ మన్నారు గవర్నర్ గారు. అయితే స్పీకర్ అందుబాటులో లేరు. ఆయన విశాఖ పట్టణంలో వున్నారు. అక్కడి నుంచి మొదట ఆయన కారులో బయల్దేరారు. కారులో వచ్చే టప్పటికి ఆలస్య మౌతుందనే వుద్దేశ్యంతో చంద్రబాబు ఆయన్ను మార్గ మధ్యంలో ఆపి, హెలికాప్టర్ పంపించారు.

స్పీకర్ సిటీకి వచ్చిన తర్వాత ఎమ్మెల్యేల పెరేడ్ జరుగు తుంది. అందులో బలం నిరూపణైతే రేపు (26 తేది) పగలు పది గంటలకు [illegible]

పొడిచాడు. ఆయనకు చాలినంత మంది ఎమ్మెల్యేల బలం లేదు. ఇప్పుడు చంద్రబాబు ఆత్మగౌరవ నినాదంతో బయట పడ్డాడు. ఆయనకు ఎమ్మెల్యేల బలమే కాదు, ఎన్టీఆర్ కుటుంబ సభ్యుల మద్దతు కూడా వుంది. ఆనాడు ఎన్టిఆర్ సచ్ఛీలుడు, ధీరోదాత్తుడు; ఈనాడు ఎన్టీఆర్ భార్యాలోలుడు, మానసిక దౌర్బల్యుడు. నా భార్య పెత్తనం సహించక పోవడం అల్లుడు చేసిన తప్పిదమని ఆయన ఏ ముఖం పెట్టుకొని ప్రజలకు నచ్చ చెప్తాడు? ఆనాడు తెలుగు దేశంలో ద్వితీయశ్రేణి నాయకత్వం సమర్థ వంతంగా వుండింది; జిల్లా కమిటీలు సమర్థించాయి కాబట్టి రాష్ట్ర మంతా తిరిగి ప్రచారం చేయగలిగాడు. ఈనాడు తెలుగు దేశంలోని సీనియర్లు, సమర్థులంతా ఇద్దరి మధ్యా నచ్చ గడ్డి మండుతున్నది. ఉప్పులో నిప్పుగా వున్న వారు ఆశ్చర్య కరంగా ఒకటై పోయారు. ఈ కలయిక వెనుక హరికృష్ణ, బాలకృష్ణల ఒత్తిడి చాలా వుందని చెప్తారు. ఎవరు నాయకుడు అన్న ప్రశ్న వచ్చినప్పుడు బాలకృష్ణను ముఖ్య మంత్రిత్వం స్వీకరించమని ఒక బలమైన వర్గం కోరింది. అందుకాయన తిరస్కరించారు. హరికృష్ణను పెట్టమన్నాడు. హరికృష్ణ కూడా ఒప్పుకోలేదు. ఇక మిగిలింది అల్లుళ్లిద్దరు. ఇద్దరిలో చంద్రబాబుకే ఎమ్మెల్యేల బలం ఎక్కువ. అందువల్ల దగ్గుపాటి బేషరతుగా అందుకు అంగీకరించ వలసి వచ్చింది.

* * *

చంద్రబాబు సమర్థుడు. తెలుగు దేశంలో చిన్న కార్యకర్త నుంచి ఆయనకు

## ప్రకటన

నా కక్షిదారుడు పాలిచర్ల సాయిరాం రెడ్డి ఇచ్చిన సంజాయిషీ మేరకు ఇందు మూలముగా తెలుపడ మేమనగా నా కక్షిదారునికి హక్కు అనుభవము గల కోవూరు పంచాయితీ ఏరియాలోని డోరు నంబరు 8.4.97A గల ఇంటిని పాలిచర్ల ఆదిశేషారెడ్డి, మోసపూరితముగా అన్యాక్రాంతము చేయు ప్రయత్నము చేయు చున్నందున ఎవరైననూ విక్రయించు కొన్ననూ, ఆదుమానము వగైరా చేయించిననూ నా కక్షిదారుని పై చెల్లవని తెలుపుచున్నాను.

సి. సురేంద్రరెడ్డి, అడ్వకేటు, కోవూరు

## కావలి సబ్ జడ్జి వారి కోర్టులో

I.A. 208/93::S.C. /93

సిండికేటు బ్యాంక్,
సీతారామపురం -వాది

Vs

1)గావిడి జార్జి, S/o. చెన్నయ్య
2) పాగర్ల వెంకటేశ్వరరావు,
S/o. జయప్రధం -ప్రతివాదులు

నెల్లూరు, నెల్లూరు జిల్లా అనువారికి ఈ నంబరున వాది మీ మీద దావా దాఖలు చేయగా నోటీసు నిమిత్తము 5.9.95 తేదికి వాయిదా వేయబడి వున్నది. మీరు ఆ దినం పగలు పది గంటలకు పై కోర్టు వారి ఎదుట హాజరయి మీకు గల ఆక్షేపణలు తెల్పుకోవలసినది. లేని ఎడల మీ పరోక్ష మందు యక్స్‌పార్టీగా తీర్మానించబడును.

వై.రవీంద్రనాధ్‌బాబు
అడ్వకేటు, కావలి

## వేలం ప్రకటన

**అఫిషియల్ రిశీవర్ వారి కార్యాలయము, నెల్లూరు**

కావలి సబ్ కోర్టు, ఐ.పి.నం. 4/90

మర్రివెంకటసుబ్బయ్య మరియు మర్రి వెంకయ్య, చెన్నాయపాళెం,
కావలి మండలం. -ఇన్‌సాల్వెంట్స్

పై నంబరు ఐ.పి.లోని యిన్‌సాల్వెంట్స్ తాలూకు చెన్నాయపాళెం గ్రామము కావలి మండలములోని స్థిరాస్తులను నెల్లూరులోని అఫిషియల్ రిశీవర్ వారి కార్యాలయములో 23.9.95 తేదిన పగలు 2 గంటలకు బహిరంగముగా వేలము వేయబడును. పాటదారులు షరత్తులు, యిస్త్రిహారు వగైరాలను పై కార్యాలయమును పనిచేయు వేళలలో వచ్చి తెలుసు కొనవచ్చును.

ఎమ్.కె.సింగరాజా
అఫిషియల్ రిశీవర్
నెల్లూరు

నెల్లూరు
14.8.1995



గూడూరులో అరెస్టయిన కరెంట్ తీగల దొంగలతో ఎస్ఐ వెంకట్రామి రెడ్డి.

## జనవాణి

3 పేజీ కొరవ

వుండదు. ఒక రోజు నేషనల్ ఫ్రంట్ అంటారు. మరో రోజు భారత దేశమని అయోమయం సృష్టిస్తుంటారు. జాతీయ స్థాయి నాయకుల వ్యాఖ్యల్లో పరిణతి వుండాలి. గాలి వాటాన గెలిచిన ఎన్టీఆర్‌కు ఆ అలవాటు బహుశా సాధ్యపడక పోవచ్చు.

నెల్లూరు -సిహెచ్ వాసుదేవరావు

### వేదాయపాళెం బస్టాండ్‌లో బస్సులు నిల్పండి!

అయ్యప్ప దేవాలయం నుండి బయలు దేరే టౌన్ బస్సులు వేదాయపాళెం బస్టాండు వద్దకు వచ్చి ఎక్కువ సేపు ఆగి పోతుంటాయి. ఈ బస్టాప్‌లో 10 బస్సులు వరకు ఆగే వసతిగా స్థలం వుంది. కాని అవి అక్కడ ఆగడం లేదు. జాతీయ రహదారి పై వుండే టర్నింగ్ పాయింట్ వద్ద వరుస కడుతున్నాయి. దీనివల్ల ఆ మార్గాన పోయే వాహన చోదకులకు తిప్పలు తప్పడం లేదు. దీనివల్ల ఈ సెంటర్‌లో తరచూ ప్రమాదాలు సంభవిస్తున్నాయి. ఇంతకు ముందు ఇద్దరు కానిస్టేబిళ్లు వుండి ట్రాఫిక్‌ను కంట్రోలు చేసే వారు. ఈ మధ్య వారు కనిపించడం లేదు. ట్రాఫిక్ ఎస్ఐ స్పృత్వీ నారాయణ ప్రత్యేక శ్రద్ధ తీసుకొని అయ్యప్ప గుడి నుంచి వచ్చే బస్సులు వేదాయ పాళెంలోని బస్టాండ్‌లో నిలిపేట్టిలా, బయలు దేరే ముందు ట్రంక్‌రోడ్ పై ఆగకుండా చూడాలి.

నెల్లూరు -ఎం.ఆలి

### ఎంప్లాయిమెంట్ ఎక్చేంజీలు మూసేయ్యండి!

మన రాష్ట్రంలోని ఎంప్లాయిమెంట్ ఎక్చేంజిలు రిజిష్టరు చేసుకొన్న నిరుద్యోగుల వివరాలు సేకరించి ప్రభుత్వానికి నివేదికలు సమర్పించడానికి తప్ప మరెందుకూ ఉపయోగ పడడం లేదు. విద్యార్హతలు సంపాదించిన వారు తమ పేరు నమోదు చేసుకుంటే ఏదో జరుగు తుందన్న నమ్మకంతో బయలు దేరతారు. సంవత్సరాలు గడుస్తున్నా ఆఫీసు నుండి పిలుపు రాక విసుగెత్తి రెన్యువల్ చేయించడం మానేస్తారు. ఉపాధి కల్పన జరగక పోయినా నిర్ణీత వయస్సు దాటిన అభ్యర్థులను తమ జాబితాల నుంచి తొలగించి చేతులు దులుపు కొంటారు. పలు ఉద్యోగ నియామకాలు ఎంప్లాయిమెంట్ కార్యాలయంతో సంబంధం లేకుండానే జరిగి పోతుంటాయి. తమకు ఇంటర్వ్యూ రాలేదని ఎవరైనా నిరుద్యోగులు ప్రశ్నిస్తే సినియారిటీ వుందా? విల్లింగ్ లెటరిచ్చావా అని కసురు కొంటుంటారు. ఏ మాత్రం ఉపయోగ పడని ఇవి ఉండడం కన్నా మూసి వేయడం మేలు.

గూడూరు -కె.వి.కిరణ్‌కుమార్

### ప్రధానిగా ఎన్టీఆర్?

ఎప్పటి నుంచే ఎన్టీ రామారావుకు ప్రధాని కుర్చీ పై కన్ను పడి వుంది. ఈ మధ్య ఆ ఆశ మరీ ఎక్కువై పోయింది. రెండు రోజుల క్రితం పార్లమెంటుకు పోటీ చేస్తానని చెప్పి లైనులోకి వచ్చి నిలబడి పోయారు. ఈ ప్రకటన విన్న లక్ష్మిపార్వతి ఆనందానికి అవధులు లేకుండా వున్నట్లుంది. రామారావును ఢిల్లీకి పంపి ఆంధ్రా జయలలిత కావాలని వువిళ్లూరు తున్నారామె. అన్నగారు నేషనల్ ఫ్రంట్ నాయకునిగా గెలుస్తారో, భారత దేశం పార్టీ స్థాపిస్తారో ఇంకా తెలియదు. ముఖప్రీతి మాటలంటే ఎన్టీఆర్‌కు మక్కువ ఎక్కువ. ఈ మధ్య భజన రాయుళ్ల భజన వల్ల ఎన్టీఆర్ ఒక చోట నిలబడ లేకపోతున్నారు. ఆయన ముఖ్య మంత్రి అయ్యాక రాష్ట్రాన్ని దివాళా తీయించారు. ఏదైనా గాలి వాటం వల్ల ఎన్టీఆర్ ఆ పదవి అధిష్టిస్తే దేశానికి అంత కన్నా అరిష్టం మరొకటి వుండదు.

గూడూరు -అవులకొండయ్య

### విద్యుత్ కోత విషయమై ప్రజలు వుద్యమించాలి!

సకల కొరతల మయమైన మన రాష్ట్రంలో నేడు మనందర్నీ తీవ్రంగా బాధిస్తున్న అంశం విద్యుత్ కోత. విద్యుచ్ఛక్తి - అభివృద్ధికి అత్యంత కీలకమైన అద్భుత చోదక శక్తి. కాని గత సంవత్సరం డిశంబర్‌లో మొదలైన విద్యుత్ కోత ఈ యేడు ఆగస్టులో కూడా కొనసాగుతూనే వున్నది. విద్యుచ్ఛక్తి లేకపోతే ప్రభుత్వ ఆఫీసుల్లో పనులు జరగవు. పరిశ్రమలు సరిగా నడవక వస్తూత్పత్తులు అంతంత మాత్రంగానే జరుగుతాయి. ఆసుపత్రుల్లో అత్యవసర ఆపరేషన్లు, పరీక్షలకు ప్రిపేరయ్యే విద్యార్థుల ఇబ్బందులు అన్నీ యిన్నీ కావు. పనులన్నీ మానేసి ఇంట్లో గమ్మున కూచుందా మన్నా తట్టుకోలేని ఉబ్బ; బయట నిభాయించ లేని ఎండ దెబ్బ. అత్యంత ప్రధానమైన, శక్తివంతమైన విద్యుచ్ఛక్తి సరఫరా ఒక్క ప్రభుత్వం ద్వారానే జరుగుతున్నది. కొరత కారణంగా ఏర్పడిన ఈ దుఃఖ భాజితమైన స్థితిని ముందుగా పసి కట్టి, నివారణో పాయాలు ముందుగా కనిపెట్టి వుంటే బాగుండేది. కోత వేళల్ని ముందుగా తెలియ చేసే కనీస విద్యుక్త ధర్మాన్ని జీతం తీసుకొనే అధికారులు మరచి పోయారు. విద్యుత్ సరఫరా వైఫల్య విషయమై ప్రజలు ఏదో ఒక రూపంలో నిరసన తెలియ జేసేందుకు సంసిద్ధులు కావాలి.

గూడూరు -పి.వి.ప్రభాకరరావు

### లక్ష్మిపార్వతి ధోరణి మారాలి!

ముఖ్యమంత్రి ఎన్టీఆర్ సతీమణి వలె వార్తల్లోకి ఎక్కిన రాజకీయ నాయకుల సతీమణులు మరొకరు లేరు. రాజ్యాంగేతర శక్తి అనే పదం ఈమెకు ఖచ్చితంగా సరిపోతుంది. భారత రాష్ట్రపతి శంకర్ దయాళ్ శర్మ గారి సతీమణి పోస్ట్ గ్రాడ్యుయేట్. ఆమె భర్తకు చేదోడు, వాదోడుగా ప్రభుత్వ, ప్రభుత్వేతర సభల్లో కేవలం అలంకార ప్రాయంగా మాత్రమే పాల్గొంటారు. రాజీవ్ గాంధీ బ్రతికున్న రోజుల్లో సోనియా కూడా ఇదే ధోరణిలో వుండేవారు. అమెరికా అధ్యక్షుని సతీమణి హిల్లరీ క్లింటన్ కూడా రాజకీయాల్లో పాల్గొనక, ప్రభుత్వ విషయాల్లో జోక్యం చేసుకోక తమ విలువను నిలబెట్టు కున్నారు. కాని లక్ష్మిపార్వతి వీటికి విలక్షణంగా వ్యవహరిస్తున్నారు. ఆమె ఎన్టీఆర్ ఆరోగ్యం, ఇల్లు, డాక్టరేట్ పని వరకు సరి పెట్టుకొంటే సరి. లేకుంటే తెలుగు దేశం మరింత భ్రష్టు పట్టడం ఖాయం.

నెల్లూరు -కె.ప్రసూన

## జిల్లావార్తలు

5 పేజీ కొరవ

చేయడానికి వీలుండగా, సిబ్బంది కొరత వల్ల 5 నుండి 6 టన్నులు మాత్రమే తయారు చేసి విక్రయిస్తున్నారు. దీనికి అనుబంధంగా 25 టన్నులు 5,6 రోజులు నిలువ చేసుకునే విధంగా కోల్డు స్టోరేజిని కూడా నిర్మించడం జరిగింది. దీని పరిస్థితి కూడా ఈ రీతినే సాగుతున్నది. ఐస్ ఫ్యాక్టరీ వర్కైనా లీజుకు ఇవ్వాలని అధికారులు ప్రయత్నిస్తున్నారు.

### ఐడియో వాలంటరీ ఆర్గనైజేషన్

అల్లూరులో రెండు, మూడు సంవత్సరాల ఒకితం పలు స్వచ్ఛంధ సేవా సంస్థలు పలు ఏర్పడి ప్రజలకు పోటీలు పడి తమ సేవ లందించాయి. కానీ ఇటీవల ఆ సంఘాలు మూత బడి పోయాయి. ఆ లోటును పూడ్చేందుకు ఐడియో వాలంటరీ ఆర్గనైజేషన్ ప్రారంభింప బడింది. ఈ సంస్థ మొదటి కార్యక్రమంగా 14 తేది రామకృష్ణా జూనియర్ కళాశాలలోని విద్యార్థులకు ఉచిత వైద్య శిబిరాన్ని ఏర్పాటు చేసింది. దరిదాపు 1300 మంది విద్యార్థినీ, విద్యార్థులకు వైద్య పరీక్షలు నిర్వహించి ఉచితంగా మందులు పంచి పెట్టారు. 80 మందికి బ్లడ్ గ్రూపింగ్ పరీక్షలు కూడా చేసారట. ఈ కార్యక్రమంలో డాక్టర్లు వి.వి.జి. కృష్ణ మూర్తి, విజయ కుమార్, దయాకర రెడ్డి, రమేష్, చలపతి రావు, పద్మావతి పాల్గొన్నారు. ఈ సంస్థకు గౌరవ అధ్యక్షులుగా విడెం మస్తాన్ రెడ్డి, అధ్యక్షునిగా కె. సుధీర్ కుమార్ రెడ్డి, డైరక్టర్‌గా మండే చంద్రశేఖర్, కార్యదర్శిగా బి. కృష్ణ చైతన్య, కోశాధికారిగా హరి ప్రసాద్, ఆర్గనైజర్లుగా డాక్టర్ వై.వి. చలపతి రావు, దోగిపర్తి సత్యనారాయణ పనిచేస్తారు.

## ఘరానా మోసం

2 పేజీ కొరవ

కంపెనీల ద్వారా వడ్డీలకు డబ్బు .. అధిక మొత్తంలో, బినామీ పే[illegible]తో షేర్లకు దరఖాస్తు చేయిస్తారు. దీనివల్ల ఓవర్ సబ్‌స్క్రిప్షన్ వీలౌతుంది. ఇది చూసి మామూలు ఇన్వెస్టర్లు తామూ ఎగబడి షేర్లకు దరఖాస్తు చేస్తారు. గ్రే మార్కెట్ ప్రీమియం, ఓవర్ సబ్‌స్క్రిప్షన్‌ల వల్ల షేర్లు అలాట్ అయితే అధిక లాభాలు వస్తాయనే ప్రచారం కల్గించ బడుతుంది. కాని అది జరగదు. పెద్ద బ్రోకర్లు స్టాక్ ఇన్వెస్ట్ ద్వారా అధిక లాభం షేర్లు తమ వశం చేసుకొని షేర్ల ధరలు పెరగ కుండా చూస్తారు. అప్పుడు, గ్రే మార్కెట్‌లో అధిక ప్రీమియంకు కొన్న వారికి రు 10ల ధర కల్గిన షేర్లు అంట గడతారు. చిన్న ఇన్వెస్టరు మునిగి పోతాడు.

ప్రమోటర్లు, బ్రోకర్లు, ఫైనాన్స్ కంపెనీలు కలిసి చేస్తున్న ఈ ఘరానా మోసంలో చట్టానికి ఎవరూ దొరకరు. సెబి కూడా ఏమీ చేయలేదు.

## పంచాంగం

### వినాయకచతుర్థి

29తేది మంగళవారం వినాయక చతుర్థి

### ఆగస్ట్ తిథులు

శ్రావణబహుళ

తే 26 శని అమావాస్య ఉ.గ. 9.45 వ

భాద్రపదశుద్ధ

తే 27 ఆది పాడ్యమి ఉ.గ. 10.13 వ

తే 28 సోమ విదియ ఉ.గ. 9.47 వ

తే 29 మంగళ తదియ ఉ.గ. 9.07 వ

తే 30 బుధ చతుర్థి ఉ.గ. 7.58 వ

తే 31 గురు పంచమి ఉ.గ. 6.26 వ

తరువాత షష్టి రా.గ. 4.40 వ

తే 1 శుక్ర సప్తమి రా.గ. 2.30 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ

# నేను మీరా బాయినా- నగ్మా ప్రశ్న?

ఏవిఎం స్టూడియో మేకప్ రూంలోంచి నగ్మా సెట్‌లోకి వెళ్లి పోబోయిందల్లా ఆగి విష్ చేసింది. "ఎక్కడ? ఈ మధ్య మద్రాసులో కనిపించలేదు. బొంబాయి సినిమాలతో బిజీయా?" అని అడిగితే "బొంబాయి కన్నా నాకు మద్రాసులోనే సినిమాలు ఎక్కువ. ఈ మధ్య లవ్‌బర్డ్స్ సినిమా షూటింగ్ కోసం ఫారెన్ వెళ్లొచ్చా. రెండు పాటలు పిక్చరైజ్ చేశారు. అప్పటిదే చిత్రం షూటింగ్‌కి బయలు దేరడం" అంది.

"ఇంత సెక్సీ దుస్తుల్లోనా?" అని అడిగితే "ఏం. నేను వేసేది మీరాబాయి పాత్ర కాదు కదా?" అంటూ చెప్పి, సెట్లోకి బయలు దేరింది.

## విజయశాంతి కొత్త త్రిభాషాచిత్రం

"పేరుపోయిన థ్రిల్లర్‌గా మలయాళ హీరో సురేష్ గోపి. అతన్ని వేటాడే సిబిఐ ఆఫీసరుగా విజయ శాంతి నటించే చిత్రం సెప్టెంబర్ 22 న ప్రారంభం కాబోతుంది. తెలుగు, తమిళ, మలయాళ భాషల్లో తయారవు తోంది" అన్నారు. డైరక్టర్ భద్రన్. ఈ యువ దర్శకత్వంలో వహించిన 'స్ఫటికం' చిత్రమే తెలుగులో తయారవు తున్న "వజ్రం".

## "ఒరేరిక్షా!"

"రాజకీయ నాయకులకు చక్కని గుణ పాఠం నేర్పుతుంది. గ్రామం నుంచి తల్లి, చెల్లెలు, భార్యతో పట్నాని కొచ్చిన ఒక రిక్షా మనిషి బయోగ్రఫీ ఈ చిత్ర కథ" అన్నారు దాసరి నారాయణ రావు. ఆర్. నారాయణ మూర్తి, రవళి, బాబూ మోహన్, పురాణం సూర్య, వేలు, సంజీవి, శ్రీవిద్య వగైరా పాత్రధారులు. మాటలు: సంజీవి. సంగీతం: వందేమాతరం శ్రీనివాస్.



హలో గురూ చిత్రంలో ఆమని

# అభిమానులను అడ్డుపెట్టకండి!

## రజనీకాంత్ ఆప్యాయత!

ఆగస్టు 10వ తేదీ ఉదయం తిరుపతి పద్మావతి గెస్ట్ హౌస్‌లో రజనీ కాంత్‌ను ఆలయంలోకి తీసు కెళ్లడానికి స్వయంగా వచ్చారు మోహన్‌బాబు. అప్పుడు "కలెక్షన్ కింగ్ జిందాబాద్! కలెక్షన్ కింగ్ జిందాబాద్!" అంటూ బయట గుమికూడిన జన సందోహం నినాదాలు.

"కలెక్షన్ కింగ్ - అనే బిరుదు వెంకటేశ్వర స్వామికి మీ ఆంధ్ర ప్రజలు ఇచ్చిన బిరుదా? అమాయకంగా అడిగాడు రజనీకాంత్.

"స్వామికి కాదు. ఆ బిరుదు నాకు!" సగర్వంగా అంటూ రజనీ కాంత్‌తో బయట కొచ్చారు మోహన్ బాబు.

"రజనీకాంత్‌కు జై! రజనీ కాంత్‌కు జై!" అంటూ మోహన్ బాబు పేరును పట్టించు కోకుండా జనం జయజయ ధ్వానాలు చేస్తూ సమీపించ బోయారు.

"ఏయ్! ఎక్కడయ్యా పోలీసోళ్ళు? ఆ జనాన్ని రానీయకండి. వాళ్లను తోయండి" అని అరిచాడు మోహన్‌బాబు.

వెంటనే రజనీ కాంత్ అడ్డొస్తూ "మోహన్! వద్దు. వాళ్లను రానివ్వండి అభిమానులను అడ్డు పెట్టకండి. నేను చాలా కాలం తర్వాత తెలుగులో నటించిన పెదరాయుడు చూసుంటారు. అందుకే ఆ అభిమానం అంటూ తెలుగులో కొందరిని పలకరించారు. తర్వాత సెలవు తీసు కుంటున్నట్లు చేతులు జోడించి నమస్కరించారు.

మళ్లీ "రజనీకాంత్‌కి జై!" అన్నారు జనం.

## తిరుపతిలో తమాషా

# శ్రీదేవి కన్నా శేషన్ అంటే మోజు!

తల్లి అమెరికాలో శస్త్ర చికిత్స చేసుకుని సురక్షితంగా మన దేశానికి తిరిగి వచ్చిన సందర్భాన్ని పురస్కరించు కొని ఇటీవల శ్రీదేవి తల్లిని తిరుపతికి తీసుకెళ్లింది మొక్కుబడి తీర్చుకోడానికి. ఆమె ఆలయం బయటకు అలా వచ్చిందో లేదో చాలా మంది జనం ఆమెను చుట్టు ముట్టి, నానా హంగామా చేశారు. ఇంతలో ఒకతను వచ్చి "అదో అక్కడ శేషన్ ఉన్నాడురోయ్" అని చెప్పాడట. అంతే పిస్టల్ చప్పుడుకి పిట్టలు పారి పోయినట్లు వాళ్లందరూ పరుగున శేషన్ దగ్గరికి చేరుకున్నారు. "ఏమిటీ హంగామా? నేనేదో దైవదర్శనానికి వస్తే ఇలా గుమికూడా రేమిటి? అన్నారు శేషన్.

"సార్! మేమంతా మీ అభిమానులం సార్! అన్నాడట ఒకడు.

"ఎక్కడ్నుంచి వస్తున్నారు?" శేషన్ ప్రశ్న.

"ఇప్పుడే మేమంతా శ్రీదేవిని చూసి వస్తున్నామండి", అన్నాడు మరొకడు.

"ఏ శ్రీదేవి?" అడిగారు శేషన్.

"అదేమిటండీ... హిందీ పిక్చర్లలో నెంబర్ వన్ హీరోయిన్. మీకు తెలియదా?"

"తెలియాలని ఎక్కడుంది?"

గుంపులోని ఒక బుర్ర మీసాలాయన "ఇంతకీ, శేషన్ మీరేనా సార్?" అని అడక్కుండా ఉండలేక పోయాడు.

"మీకా సందేహం ఎందు కొచ్చింది? గుండు చూస్తే తెలియడం లేదూ? సాక్షాత్తూ నేనే శేషన్. పొడుగు 5 అడుగుల 6 అంగుళాలు. ఉండవలసినంత కన్నా ఎక్కువ బరువు. కొందరు రాజకీయ వేత్తలు నన్ను తోకచుక్క అంటారు. అవును, ధూమకేతు. ధూమకేతు కనిపిస్తే, ఏదైనా ఉపద్రవం సంభవిస్తుందంటారు పెద్దలు" అన్నారు శేషన్.

"బాగా చెప్పారు సార్! మీకు పాదాభి వందనం చేసి పోదాం" అంటూ

కొరవ 10 పేజీలో





# ఆంటీ: ముచ్చటగా వుంది!

## చిత్రసమీక్ష

గ్రిద్దలూరుగోపాలరావు

మౌళి దర్శకత్వంలో రూపుదిద్దుకున్న "ఆంటీ" చిత్రంలో జ్యోతి అనే పేరు గల ఆంటీ పాత్ర- చిత్రానికి ప్రాణం వంటిది. ఆవిడ వయసులో పెద్దదైనా అంద చందాలు వన్నెచిన్నెలతో పాతికేళ్ళ పడుచులా ఊరిస్తుంది. ఆవిడను చూసిన యువకులు ఎగిరి గంతేస్తారు ఆనందంతో.

నిరుద్యోగులుగా వున్న ముగ్గురు యువకులు ఆనంద్, నాగు, చంటి డబ్బున్న ఒంటరిగా వున్న ఒక ఆంటీని పొంది జీవితంలో స్థిరపడితే హాయిగా వుంటుందని కలలు కంటుంటారు. వారి మిత్రుడొకడు ఇలా కలలు కని ఆకలలను నిజం చేశాడట. అందువల్ల వీరు కూడా అలాగే ఒక ఆంటీని పట్టుకోవాలనుకుంటారు. వున్నట్టుండి జ్యోతి అనే ఆంటీ ఆ ముగ్గురు కుర్రాళ్లున్న కాలనీలోనే ఒక మంచి ఇంటిలో ఒంటరిగా కాపురానికి దిగుతుంది. ఇక ఆ ముగ్గురు కుర్రవాళ్లలో ఆనందం పొంగి పోతుంది. ఆవిడ అభిమానం సంపాదించి ఆమె చెంత చేరాలని ముగ్గురూ పోటీ పడతారు. ఆంటీ కోసం వేట సాగిస్తారు. ఆ కుర్రవాళ్ల చిలిపి చేష్టలకు ముచ్చటపడి ఆంటీ వాళ్లను దగ్గరకు తీస్తుంది. దానితో ఆవిడ వారిని ప్రేమిస్తున్నట్లుగా భావిస్తారు. తాను ముందుగా ఆవిడ ప్రేమను పొందాలని నాగు ఆవిడ బాత్‌రూం వద్దకు పోయి చెంప దెబ్బ తింటాడు.

ఆంటీ హృదయమున్న ఆవిడ. ఆనంద్ పీడ వదలించు కునేందుకు అతని అన్నా వదిన కిరాయి రౌడీల చేత అతడ్ని కొట్టిస్తారు. దెబ్బలు తిని వీధిన పడి వున్న ఆనంద్‌ను ఆంటీ ఆదరించి సపర్యలు చేసి మామూలు మనిషిగా చేస్తుంది. అతనికి ఉద్యోగం కూడా ఇప్పిస్తుంది. ఇదంతా తనను ప్రేమించే ఆంటీ ఆ విధంగా చేసిందని భావిస్తాడు ఆనంద్. తనను ప్రేమించి పెళ్ళి చేసు కోవాలనుకున్న తన మరదలు లక్ష్మిని నిరాకరిస్తాడు ఆనంద్. ఇది తెలుసుకున్న ఆంటీ వారిద్దరిని కలుపుతుంది. చదువుకొని పైకొస్తారను కున్న కుర్రవాళ్ళు వయో తారతమ్యం లేకుండా తన పైన ఆశలు పెంచు కుంటారని ఆంటీ ఎప్పుడూ అనుకోలేదు. వారి దురుద్దేశాన్ని పసికట్టి వారిని వారిస్తుంది. కానీ వారు మారరు. అనుకోకుండా ఒక రోజు ఆంటీ గత చరిత్రను, బాధాకర జీవితాన్ని తెలుసు కున్న ముగ్గురు యువకులూ పూర్తిగా మారి పోతారు. ఆవిడ బిడ్డల్లా ప్రవర్తించటం ప్రారంభిస్తారు. ఆవిడను కామదృష్టితో చూసిన వారి కళ్ళు చెమర్చి ఆమెలో అమ్మ ప్రేమను చూసుకున్నాయి. ఇదీ క్లుప్తంగా మౌళి వ్రాసిన "ఆంటీ" కథ.

కొరవ 10 పేజీలో

## టౌన్ అభివృద్ధి

4 పేజీ కొరవ

రెండవ బ్రిడ్జి పనులు పూర్తికాక మునుపే బ్రిడ్జికి ఊతంగా నిలిచే స్తంభం దెబ్బతిని పోవడం దారుణమని ఒక కౌన్సిలర్ ఆరోపించారు. దీనిపై సమగ్ర విచారణ జరిపిస్తానని ఛైర్మన్ వివేకానంద రెడ్డి హామీ ఇచ్చారు. మునిసిపల్ ఇంజనీర్ కౌన్సిలర్లకు అందుబాటులో వుండటం లేదన్న చర్చ జరుగు తున్నప్పుడు కూడా సభలో ఆయన అందుబాటులో లేకుండా పోవడంతో నిరసనలు విన్పించాయి. ఈసారి ఛైర్మన్ల ప్యానల్‌లోని ఊటుకూరు లక్ష్మయ్య, వున్నం బసవయ్య కాసేపు ఛైర్మన్ కుర్చీపై కూర్చొన్నారు. ఇక ఇండి పెండెంట్ సుబ్బారావు ఒకడే ఆ అదృష్టం కోసం ఎదురు చూస్తున్నారు.

మే నెలలో కూడా మునిసి పాలిటీ ఆర్థిక పరిస్థితి బాగుండిందని, అధికారులే దుస్థితికి దిగజార్చారని కౌన్సిలర్ ఊటుకూరు లక్ష్మయ్య ఆరోపించారు. కొత్త కౌన్సిల్‌ను గబ్బు పట్టించను పాత లెక్కలు దాచిపెట్టి అధికారులు నాటక మాడుతున్నారని ఇండి పెండెంట్ సభ్యుడు నందాని బాషా తీవ్ర స్వరంతో విమర్శించారు. గత సంవత్సరం పరిపాలనా నివేదికను కౌన్సిల్ ముందు వుంచక పోవడం అధికారుల దివాళా కోరుతనానికి నిదర్శనమన్నా రాయన. డబ్బు లేకుండానే నిన్న మొన్నటి వరకు టెండర్లను ఏ విధంగా పిలిచారని వున్నం బసవయ్య ప్రశ్నించారు. ప్రజలు పన్నులను మునిసి పాలిటీ వుద్యోగుల జీతాల కోసమే కట్టాలా; అభివృద్ధి పనులకు ఏ మాత్రం వెచ్చించరా అన్న

సందేహాన్ని కనకయ్య వెలిబుచ్చారు. వచ్చే మార్చిలోగా 95 శాతం పన్నులు వసూలు చేసే విషయమై మునిసిపల్ రెవిన్యూ సిబ్బందితో చర్చలు జరిపినట్లు ఛైర్మన్ వివేకానంద రెడ్డి చెప్పారు. ఈ అర్థ సంవత్సరానికి 1.75 కోట్ల రూపాయల పన్నులు వసూలు కావల్సి వుందని, 64 లక్షల పాత బాకీలు ఇందులో అదనంగా కలపాలన్నారు. ప్రభుత్వం నుండి వివిధ బాకీలుగా 36 లక్షలు రావాలని వివరించి చెప్పారు. ఎన్నికలకు ముందు ఇన్‌ఛార్జ్ కమీషనర్ బడ్జెట్ ప్రవేశ పెట్టడం వల్ల ఈ సమస్య పై కౌన్సిల్ మాట్లాడటం తగదన్నారు. రామ్మూర్తి నగర్ మెయిన్ రోడ్డులోని 6వ వీధిలో ఒక కౌన్సిలర్ ఇంటి ముందు వాహనాలు రాకుండా ప్రత్యేక ఏర్పాట్లు చేసేందుకు తయారు చేసిన ప్రతిపాదనను కౌన్సిల్ తిరస్కరించింది. ఇక నుండి 44 వార్డులకు సంబంధించిన అభివృద్ధి పనులు ఎప్పటి కప్పుడు నమోదు చేసేందుకు పుస్తకాలను ప్రయోగాత్మకంగా ఏర్పాటు చేస్తున్నారు. స్టోన్‌హౌస్‌పేట, నరకూరు రోడ్డును పొట్టి శ్రీరాములు రోడ్డుగా పేరు మార్చాలని కోటలక్ష్మి కుమారి ప్రవేశ పెట్టిన తీర్మానాన్ని కౌన్సిల్ ఆమోదించి ప్రభుత్వ అనుమతికై పంపారు. తన స్వంత ఖర్చుతో వీధి పేర్లను రంగులతో వ్రాయిస్తే వాటిని అధికారులు చెరిపి వేశారని శ్రీమతి అరుణ కుమారి వాపోయారు. సమావేశంలో అందరి చేత బాబాయ్‌గా పిలువబడే 4వార్డు కౌన్సిలర్ కనకయ్య ఎప్పటిలానే అస్మదీయులు - తస్మదీయుల అంశాల గూర్చి తనదైన ధోరణిలో నవ్వించి మోహినీ అవతారం గూర్చి కాసేపు మాట్లాడారు. కాని పాపం ఆయనకు అజెండా అంటే ఏమిటో తెలియలేదు. సిపిఎం పక్ష నాయకుడు మాదాల వెంకటేశ్వర్లు దాన్ని గూర్చి వివరించాల్సి వచ్చింది.

పారిశుధ్యం పై ఛైర్మన్ మాట్లాడుతూ ఈ నెల 10 తేది కలెక్టర్ ఇరిగేషన్ అధికారులతో జరిపిన సమావేశంలో పట్టణంలోని పంట కాల్వలు శుభ్రపరిచే బాధ్యత పి.డబ్ల్యుడి శాఖకు అప్పగించినట్లు చెప్పారు. అంచనాలకు అవసరమైన నిధులు కొన్ని తానే ఇస్తానని కలెక్టర్ హామీ ఇచ్చారట. పొరుదల లేకుండా నిరుప యోగంగా వున్న పిడబ్ల్యుడి పంట కాల్వలను మునిసి పాలిటీకి అప్పగించమని ఆ శాఖ ఎస్‌ఇ, కలెక్టర్‌లను తాను కోరుతానని వివేకా వివరించారు. ఇక మీదట మునిసిపల్ ఆరోగ్య అధికారి ప్రతి రోజూ కొన్ని వార్డులు విధిగా పర్యటించి పారిశుధ్య కార్యక్రమాలు పర్యవేక్షిస్తాడని, తాను కూడా రెండు రోజులకు ఒకసారి వార్డులకు వెళ్లి పని జరిగే తీరును పరిశీలిస్తానని ఛైర్మన్ చెప్పారు.

### ప్రధానికి పౌర సన్మానం

స్వాతంత్ర్యం వచ్చాక ప్రస్తుతం వున్న కౌన్సిల్ నూరోదని అందువల్ల ప్రత్యేక వుత్సవాలకు ప్రధాని పివి నరసింహ రావును పిలుస్తున్నట్లు వివేకానంద రెడ్డి చెప్పారు. ఆయనకు పౌర సన్మానం పెద్ద ఎత్తున ఏర్పాటు చేస్తారట.

సెప్టెంబర్ 25 తేది రాష్ట్రంలోని మునిసిపల్ ఛైర్మన్లు, కార్పొరేషన్ మేయర్ల సమావేశానికి నెల్లూరులో వేదిక ఏర్పాటు చేసినట్లు కూడా వివేకా ప్రకటించాడు.



### చిత్రసమీక్ష

9 పేజీ కొరవ

అంటీ జీవితంలోని కష్ట సుఖాలు, అనుభవాలు, అనుభూతులు, పలువురితో పరిచయాలు, రకరకాల సమస్యలు, ఉత్తమ విలువలు, ఆదర్శాలు వీటన్నిటి పై సుబోధకమైన శైలిలో సంఘటనలను రసవత్తరంగా చిత్రీకరించాడు దర్శకుడు. అందువల్ల అంటీ పాత్రకు ఎంతో విశిష్టమైన స్థానం ఏర్పడింది. చిత్రంలోని ప్రతి సన్నివేశం దర్శకుని ఆలోచనా సరళికి, పరిజ్ఞానానికి అద్దం పట్టింది. మితి మీరని శృంగారం, ఆహ్లాదకరమైన హాస్యం, ఆశ్చర్య పరచే సస్పెన్సు, ఆకట్టుకునే మంచి సెంటి మెంటులతో కూడుకున్న ఈ చిత్రాన్ని చూడ బుద్దేస్తుంది. చూసిన తర్వాత మెచ్చుకో బుద్దేస్తుంది.

అతి ముఖ్యమైన అంటీ పాత్రను ప్రముఖ నటి జయసుధ పోషించింది. ఆమె నట జీవితంలో ఇది మరపురాని పాత్ర. తనదైన విలక్షణ శైలిలో నటించి పాత్రకే కాదు చిత్రం మొత్తానికి జీవం పోసింది. ఆ పాత్రలో జీవించి తన నట జీవిత స్థాయిని గొప్పగా పెంచుకుంది. ఆనంద్‌గా ఆనంద్, చంటిగా రాజా రవీంద్ర, నాగుగా చిన్నా కుర్రకారు హుషారు, కొంటె తనంలో జోరు బాగా చూపారు. బ్రహ్మానందం హాస్యం, మాటా పలుకూ లేకుండా మూకాభినయంతో మరీ మరీ నవ్వించింది. రమేష్ సంగీతం, శ్రీనివాస్ కెమెరా మధురంగా మజాగా వున్నాయి. చిత్రం యువజనులకు ప్రత్యేకంగా ప్రయోజన [illegible]ంది.

### సినిమా

9 పేజీ కొరవ

ఒకడు ముందుకు ఒంగపోయాడు.

"తప్పు! అంటూ అతన్ని వారించి "ఆలయం వద్దయినా మనుషులకు మనుషులు దండం పెట్టడం తప్పని మా కేరళ రాష్ట్రీయులు అభ్యంతరం చెప్తారు. ఇక్కడ దేవుడొక్కడికే దండం పెట్టాలి. లేకపోతే నమస్కారం పెట్టించుకునే వారికే కాక నమస్కారం పెట్టే వారికీ కూడా ఆయుస్సు క్షీణం" అన్నారు.

"ఓహో!" అని ఒక పెద్దాయన అంటూండగా మిగతా వారంతా ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. కాస్సేపటికి "వస్తాం సార్! అంటూ అందరూ వెళ్లిపోయారు. శేషన్ తన దారిన తాను బయలు దేరారు.

### సుహాసిని ఇప్పుడేం చేస్తోంది?

"నా దర్శకత్వంలో తమిళంలో విడుదలైన 'ఇందిర' చిత్రం బాగానే ఆడుతోంది. త్వరలోనే తెలుగులో డబ్ చేయబడుతుంది. మరో రెండు చిత్రాలకు స్క్రిప్టులు సిద్ధం చేస్తుండగా మా ఇంటి వద్ద బాంబు ప్రేలుడు సంభవించింది కదా? ప్రస్తుతానికి ఆ స్క్రిప్టులు అట్టే పెట్టి, రెండు కన్నడ చిత్రాలలో నటిస్తున్నాను" అంది సుహాసిని ఇటీవల కనిపించి నప్పుడు! "ఏమండి మీ తెలుగు నిర్మాతలు మరీనూ? పెళ్లయి, బిడ్డకు తల్లి అయితే చాలు - హీరోయిన్ వేషం వేసే వయసు దాటి పోయిం దంటారు. నన్ను అక్కగానో, వదినగానో నటించమని అడిగారండి. ఎలా మనసొప్పుతుంది? తెలుగు మరీ కమర్షియల్ అయి పోయిందండి. ప్రేక్షకులు కూడా హీరోయిన్ డాన్సులు ఉండా లంటారట. నేనలాంటి డాన్సులు ఎలా చేయగలను? అందుకే హీరోయిన్ కాక మరే పాత్రయినా ధరించమని నన్నెవరైనా అడిగితే నవ్వొస్తుంటుంది. మీకో విషయం తెలుసా? శ్రీదేవి వయసుకన్నా నా వయస్సు రెండేళ్లు తక్కువ! ఒకసారి వేరే వేషం వేశామనుకోండి. ఇక హీరోయిన్ వేషాలకు నన్ను బుక్ చేయరు. కాని, తమిళం తీసుకోండి. రాధిక ఒక బిడ్డ తల్లి పఠుంపాన్ అనే చిత్రంలో ప్రభు తల్లిగా నటించింది.

హీరోయిన్ వేషాలకు ఆమెను ఇంకా బుక్ చేస్తూనే వున్నారు. మీన కూడ ఒక తమిళ చిత్రంలో తల్లి పాత్ర అఫ్‌కోర్స్ కూతురుగా కూడా ద్విపాత్రా భినయం చేస్తూం దనుకోండి. తెలుగు వారయితే ఇక ఆమెను తల్లి వేషాలే వేయమని అడుగు తారేమో. ఇదేం న్యాయమండి? అంది సుహాసిని.

## నేను పసివాణ్ణా? పనివాణ్ణా

**జయంపుకృష్ణ**

పుట్టిందూమిన్నిరవది, కళ్ళుతెరచి చూస్తే,
ఈ లోకం అందాల్ని చూడాలని పైకిలేస్తే
ఆకలయితే అమ్మ రొమ్ము నోటికి అందదు
అడుకోనుమట్టితప్ప మరింకేమిమిగలదు-

పలకతో అందరూ బడికి పోతావుంటే
అదేంది అయ్యనన్ను గొడ్లకాడికి పంపిందు?
కాల్లోగుచ్చుకున్న ముల్లంత లేను నేను,
కంకరరాళ్ళు కొట్టమని సుత్తిచేతికిస్తడు?

మంచి గుడ్డల్లో వున్న పిల్లకాయలు దేవుళ్లా?
చింకిగుడ్డ పీలికలతో నేనిట్టా మట్టిలో
కళ్ళు కాల్చే వెల్డింగ్‌లో, గ్యారేజిల్లో, రైల్లో
కొండలు పిండి చేసే పనుల్లో; గనుల్లో

నేను పసివాణ్ణా? పనివాణ్ణా?
పొట్టపైన గుడ్డలేదు - లోపల కూడు లేదు
వాళ్ళంతా అట్టా తింటారే-వుంటారే
మరి నేనెందుకిలా పనిచేస్తూ.. వస్తూ?

మోయలేని బరువు నానెత్తికెత్తారు
చదువుకుంటానంటే చావమొత్తారు
గొడ్లకాడికి, గొర్రెలకాడికి పోవాల

రొడ్డు కడగడం, ఇల్లు అలకడం చేయాల
మంచాలు వేయాల, కంచాలు కడిగిపెట్టాల
అయినా
మొలతాడులేనివాణ్ణి, నాపేరు 'నాయాల'
అమ్మనిచిన్నవాళ్లుగూడా 'ఒసే' అంటారు
అయ్యను అందరూ ఒరే అనిపిలుస్తారు

అట్టామమ్మల్ని పిలవడం వారికి అలవాటా?
మేంచేస్తున్నచాకిరీకిగుర్తింపు వంతపాటా?
ఉతికిన తెల్లటి చొక్కానితొడుక్కుని
భుజాన పుస్తకాల సంచి తగిలించుకుని
బళ్ళో కూచొని చదువుతుంటే బావుంటాది
అన్నీ వడ్డించుకుని, అమ్మ పక్కన కూచొని
తెల్లబువ్వ తింటావుంటేభలే బావుంటాది-

పొద్దస్తమానమూ పనిచేసిపనిచేసి
పొద్దు పొయ్యాక అలిసి తినక పడుకొంటే
ఈ పాపం, ఈ శాపం ఎవరిది??
మాసిన గుడ్డల్తో, చెమట పట్టిన కంపుతో
పెద్దవాళ్ళ ఉచ్చులో, రచ్చలో, రొచ్చులో
మురికిలో పురుగులా కులకుల లాడే
నేను పసివాణ్ణా? పనివాణ్ణా??

### త్వరలో ఎన్టిఆర్ మ్యూజియం!

"బిల్డింగ్ నిర్మాణం దాదాపు పూర్తయినట్లే, ఇక ప్రారంభోత్సవమే తరువాయి" అన్నారు శ్రీమతి లక్ష్మిపార్వతి తిరుపతిలో తమిళ హీరో రజనీకాంత్‌తో "ఆ మ్యూజియంలో మా శ్రీవారు నటించిన 350 చిత్రాల వీడియో క్యాసెట్లు, స్టిల్సు, పోస్టర్లు, శ్రీవారు ఆయా చిత్రాలలో ధరించిన ఆహార్యం, ఆభరణాలు అన్ని ఎప్పుడో సిద్ధం చేసి ఉంచాం. పౌరాణిక చిత్రాల పై నేను డాక్టరేట్‌కు సమర్పించ బోయే థీసిస్‌కు ఇవన్నీ నాకెంతగానో ఉపయోగ పడతాయి" అన్నారామె.

### ఐ.పి.ఎస్. ఆఫీసర్‌గా ఆమని

సెప్టెంబర్ 1 న హైదరాబాద్‌లో ప్రారంభమయ్యే పాంచజన్య క్రియేషన్స్ చిత్రంలో ఐ.పి.ఎస్. ఆఫీసర్‌గా ఆమని నటిస్తోంది. శేఖర్ సుమన్ హీరో. కోట శ్రీనివాస రావు, గిరిబాబు, బ్రహ్మానందం, బరన్ లిగోన్స్తి, సంజయ్ భార్గవ్, చలపతి రావు ప్రభృత నటవర్గం. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: ఎ.పి. చంద్ర.

### 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

ఈ ప్రాంతంలో కోటకు యించుమించు 18 మైళ్లలో చుట్టు ప్రక్కల ఎక్కడా ఒక మిడిల్ స్కూలు లేదు. ఈ కారణాన నాగరికత పెరిగే యీ రోజుల్లో గూడా ఈ ప్రాంతంలో ఒక మిడిల్ స్కూలున్నా లేక పోవడం శోచనీయము. అందరు రెడ్లు విద్యాగంధం పూసుకుంటుంటే యీ ప్రాంతంలో ఆ ప్రాప్తం లేక పోయింది. ఇప్పటికైనా అందరూ చేతులు కలుపుకొని వెంటనే బడిని ఏర్పాటు చేసికోవడం మంచిది.

**రాపూరు**

యుద్ధము ముగిసిన పిమ్మట గూడా ప్రజాయుద్ధం అనే అంటారా? అని రాపూరు రాజ్యం నుంచి పెంచలురెడ్డి ప్రశ్నిస్తున్నాడు కామరేడులను.

**రాయబారం**

నెల్లూరు మోటారు లేబరు యూనియన్ వారి సహాయార్థం 20 తేది స్థానిక నటకులచే ప్రదర్శింప బడ్డది. మన చెన్నూరు కేసరి, సోమిశెట్టి ప్రభృతులు నటకులు రాయబార ఘట్టం బాగా రక్తి గట్టింది. ఖర్చులు పోను వెయ్యి మిగిలింది.

చిత్రగుప్తుడు

### జనార్ధన్‌రెడ్డి

4 పేజీ కొరవ

శిరసా వహించే వాడినన్న విషయం అందరికీ తెలునన్నారు. రామారావు వాస్తవ రూపాన్ని ప్రజలు ఇప్పుడే గ్రహించారు కాబట్టి పార్లమెంటు ఎన్నికల్లో కాంగ్రెస్ అనుకూల ఫలితాలు [illegible]ంటూ పత్రికలు [illegible] అదే [illegible]స్తున్నారు కదా. కాబట్టి [illegible] ముగించారు. మాజీ మం[illegible] పెంచలయ్య, ఆనం సంజీవ [illegible] నందరెడ్డి, ఇందిరాభవన్ మేనేజింగ్ ట్రస్టీ పివి రమణారెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

వడగాడ్పులతో బడలి పోయిన, తెలుగు చల్లిన సాహితగ్గర పై పన్నీటి జల్లు

# పునరుత్థానం

పైన అనంతా కాశానికి అలముకొన్న నీలిమ... కింద దిగంతాలకు పరచుకొన్న పచ్చదనం. మధ్యలో పాల మీగడలా తేలియాడే మబ్బులూ - వాటి మీదుగా స్వర్గానికి నిచ్చెనల్లా వాయులీనం మెట్లు! - ఈ ముఖ చిత్రం చూడగానే ఇదో అలౌకిక కావ్యం అనిపిస్తుంది పాఠకులకు! దళిత కవిత్వం, స్త్రీవాద కవిత్వం ఇత్యాది ఉద్యమ కవితా వడగాడ్పులతో బడలి పోయిన తెలుగు పాఠకుడి పాలిట ఓ పన్నీటి జల్లు 'పునరుత్థానం' కావ్యం!

కవిత్వాన్ని కంపార్టుమెంటలైజ్ చెయ్యకపోతే వాడు తెలుగు క్రిటిక్ కానట్లే లెక్క, గనుక ఈ కవిత్వానికి కూడా విధిగా ఓ ముద్ర వేయాల్సి వస్తున్నది. ఇది అచ్చమైన స్వచ్ఛమైన, శుద్ధమైన, నిబద్ధమైన అనుభూతి కవిత్వం అని కావ్యంలోని ప్రతి కవితా సాక్ష్యమిస్తున్నది. అనుభూతి అంచుల దాకా వెళితే అది మార్మికత కూడా అవుతుంది. ఇందులో మార్మిక కవిత్వం కూడా పుష్కలంగా వుంది.

అనుభూతి కవిత్వానికి ఆధునిక ఆది కవి అయిన ఆర్చిబాల్డ్ మెక్లీష్‌ని చదువుతున్నంత పారవశ్యం కలుగుతుంది. సౌభాగ్యం కవిత్వం చూస్తుంటే మెక్లీష్ తన 'Poetry and Experience' అనే గ్రంథంలో ఒక సందర్భంలో ఇలా అంటాడు. "The Poet's labour is to struggle with the meaninglessness and silence of the world, until he can force it to mean'.

ఒక కవిగా సౌభాగ్య చేస్తున్నది కూడా ఈ పనే! ఆధునిక సమాజంలోని జడత్వం, స్పందనా రాహిత్యం ఈ కవిని ఎంతో కలవర పరుస్తాయి. ఉత్త మాటల పోగుగా మారిన మనిషి అంటే కవికి అసహ్యం! మాటల మందసాన్ని తల పై మోసుకొంటూ వెళ్ళే వాణ్ణి మనిషన దానికి మనసొప్పదు అంటాడు (జ్ఞాపకాల ఉయ్యాల)

"వొట్టి చూపులేనాలు మాట్లాడకుండి క్షణాలు, నిముషాలు గంటల చలనం లేకుండా చూసుకోండి చాలనిపించినప్పుడు సాగిపోండి గుండెల్లో పేరుకున్న చిగుళ్ళి దండలు కట్టండి. పరిమళాల పరిభాషని పది మందికి పంచండి" అని సందేశమిస్తాడు.

మన అనుభూతి కవులలో చాలా మంది ఏకాక్షులే! వాళ్లకి ఇతర కవిత్వ పంథాలు నచ్చవు. కానీ సౌభాగ్యది చాలా విశాలమైన దృష్టి. ఈ కవి కవిలో కాన్నంతా ప్రేమిస్తాడు. అన్ని రకాల కవితల్నీ ఆరాధిస్తాడు.

"ఒక స్పర్శ చాలదు" అనే కవితలో ఇలా వుంది. "కొమ్మ"ల పై ఎగిరే గువ్వలకు పంజరాలెందుకు. ఒక్కదారి చాలదు. ఒక్క స్పర్శ చాలదు ఒక్క పువ్వే చాలదు. ఆకాశమంత పచ్చదనానికి అమ్ముడు పోయాకా, మాటలన్నీ రామ చిలుకలే! ఆలోచనలన్నీ చివుళ్ళే" సౌభాగ్య దృష్టిలో కవులంతా ఇంద్ర జాలకులే!

కవులంటే "దృశ్యానికి రంగును దిద్దేవాళ్లు, అనుభవాలకు అందాలు అద్దే వాళ్లు" అని నిర్వచిస్తాడు. (కవుల కోసం)

"శాపగ్రస్తుల అర్ధ స్వప్నం కవిత్వం" అని ప్రవచిస్తాడు.

బాల్య స్మృతులను గురించి, చుర్మైన ప్రేమల గురించి, ఏకాంతం గురించి చివరికి జీవుని వేదన, మరణం మీద ఇందులో గొప్ప గొప్ప కవిత లున్నాయి. "దుఃఖం దీపంలా వెలుగుతుంది. సంతోషం తైలంలా కరుగు తుంది. ఎవరో జల్లెడ పడుతూనే వుంటారు. మనుషులు ధాన్యంలా కిందికి జారుతూనే వుంటారు" అనే పంక్తుల్లో గాఢమైన తాత్వికత మనల్ని కదిలిస్తుంది "మరణం దేవుడు తిప్పేసిన పేజీ" అని చెప్ప గలిగిన ఈ కవి తాత్త్వి క దరహాసం మనల్ని ఆకట్టు కుంటుంది!

సౌభాగ్యలోని గొప్ప సుగుణం సృజనాత్మకత! దేవులపల్లి నుంచి దర్భశయనం వరకూ అనుభూతి కవు లెందరో వున్నా వారి నీడలు ఈ కవి పై ఏ మాత్రం పడలేదు. భావంలోనూ, భాషలోనూ తనకంటూ ఒక సొంత శైలిని నిర్మించు కోవడం ఈ కవి ప్రత్యేకత. "కవి అన్న వాడు మరణించాలి, అంతే కాదు పునర్జన్మించాలి, నూరేళ్ల జీవితంలో కనీసం వంద జన్మలన్నా ఎత్తాలి" అనే థీమ్‌తో సౌభాగ్య సృష్టించిన పునరుత్థానం కావ్యం ఒక ఉత్తమ కవితగా విమర్శకుల ప్రశంసల్ని అందుకోవడం అనివార్యం!

## గ్రంథసమీక్ష

**పునరుత్థానం**

రచయిత
**సౌభాగ్య**

సమీక్షకుడు
**తిరుమూరుసుధాకరరెడ్డి**

ప్రతులకు
**సిస్టమ్స్ ఆడిట్ డిపార్టుమెంట్**
హెచ్ఏఎల్, బాలానగర్,
హైదరాబాద్ - 500 042
**వెల రూ. 15/-**


నెల్లూరు ఎక్స్‌ప్రెస్ ప్రత్యేక సంచికను ఆవిష్కరిస్తున్న మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి. ప్రక్కన ఎడిటర్ తుమ్మల సుబ్బారెడ్డి, ఎమ్మెల్యే టి. రమేష్‌రెడ్డి, కో ఆపరేటివ్ బ్యాంక్ ఛైర్మన్ వేనాటి మునిరెడ్డి.

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

అభినందించి వెళ్లారు. కార్యక్రమంలో జిల్లా మహిళా కాంగ్రెస్ ఉపాధ్యక్షురాలు బివి లక్ష్మి, టౌన్ మహిళా కాంగ్రెస్ బి.సి. సంఘం అధ్యక్షురాలు ఎన్. కోటమ్మ, బుజబుజ నెల్లూరు సర్పంచ్ వి. సులోచనమ్మ, ఎన్. జానకి, కౌన్సిలర్ రాళ్లపల్లి సుబ్బలక్ష్మి తదితరులు పాల్గొన్నారు. అనంతరం మహిళలు కలెక్టరుకు వినతి పత్రం సమర్పించి వచ్చారు. ఇటీవల టౌన్‌లో జరిగిన ధర్నాలలోకెల్లా మహిళా కాంగ్రెస్ కార్యక్రమం మణి మకుటంగా నిలచింది.

### మహాభాగవతోపన్యాసాలు

సాహిత్య సదస్సు ఆధ్వర్యంలో 14 తేది నుండి 17 తేది వరకు టౌన్ హాల్‌లో మహా భాగవతో పన్యాసాలను నిర్వహించింది. తొలి రోజు ఛార్టర్డ్ అకౌంటెంట్ పంచాగ్నుల జానకి రామయ్య జ్యోతి ప్రజ్వలనతో సభ ప్రారంభ మయ్యింది. తొలిరోజు స్వయం పాకుల వెంకట శేషశాస్త్రి స్మృత్యంక సభ; డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్షించి, శాస్త్రి గారి గుణ గణాలను ప్రస్తుతించారు. డాక్టర్ కె. వెంకటేశాచార్య వ్యాస వైశిష్ట్యం - మహా భాగవతం అనే అంశం పై మాట్లాడారు. ఇది వ్యాస దేశం, మనది వ్యాస సంస్కృతి, కాని ఈ దేశం ప్రస్తుతం రాజకీయ నాయకులకు స్వర్గమై పోయిందని వాపోయారాయన. 15 తేది కొండా బలరామిరెడ్డి అధ్యక్షతన జరిగిన సభలో శ్రీమతి పద్మ చక్రవర్తి వీణానాదం ఆహుతులను పరవశింప జేసింది. మహాభాగవతంలోని శ్రీ కృష్ణ తత్వాన్ని గూర్చి వెంకటేశార్యులు వివరిస్తూ భక్తిలేని జ్ఞానం ప్రయోజనం లేదని, ముక్తికి భక్తియే సాధనమని, స్నేహమే భక్తని విడమర్చి చెప్పారు. 16 తేది ఒంగోలు సోదరీ మణులు సౌమ్య, సుధల భక్తి గీతాలాపన జరిగింది. చివరి రోజు 17 తేది జరిగిన కార్యక్రమానికి రొటేరియన్ జె.వి.రెడ్డి అధ్యక్షించారు. శ్రీ కృష్ణుని శృంగార లీలలను విమర్శకుల నోళ్లకు తాళాలు పడే విధంగా వెంకటేశాచార్య వివరించారు. నాలుగు రోజుల సభా కార్యక్రమాలకు స్వయంపాకుల శ్రీనివాసులు, పి. మధుసూదన్, జి. విద్యాపతి పోషకులుగా వ్యవహరించారు. ఈ వయసులో కూడా కార్యక్రమాలను నెత్తిన వేసుకొని జయప్రదంగా నిర్వహించిన సాహిత్య సదస్సు అధ్యక్షులు గోనుకొండ వెంకట సుబ్బయ్య అభినంద నీయులు.

### రైల్వే వినియోగదారుల సంఘ సమావేశం

నెల్లూరు జిల్లా రైల్వే యూజర్స్ అసోసియేషన్ సమావేశం సంఘం ఉపాధ్యక్షుడు అమరా సుబ్బారావు అధ్యక్షతన 13తేది రైల్వే స్టేషన్‌లో జరిగింది. రైల్వే స్టేషన్ మేనేజర్ జి. రాములు, ట్రాఫిక్ ఇన్స్‌పెక్టర్ కె.ఎల్.ఎన్. రెడ్డి, జడ్.ఆర్.పి.సి.సి. సభ్యుడు జి. సుధాకర రావు ముఖ్య అతిథులుగా విచ్చేశారు. కోశాధికారి ఇన్నమూరి వెంకటేశ్వర రావు అసోసియేషన్ నిర్వహించిన పనులు తెలియ జేస్తూ, కోరమండల్, మంగళ ఎక్స్‌ప్రెస్‌లను నెల్లూరులో నిలపాలని కోరారు. సుధాకర రావు మాట్లాడుతూ రైల్వే స్టేషన్ తూర్పు వైపు బ్రిడ్జి ఏర్పాటుకు కృషి చేస్తానని చెప్పారు. సమావేశంలో బి. శ్రీనివాసులు, అచ్యుత సుబ్రహ్మణ్యం, ఎమ్. ధర్మారెడ్డి, బి. వెంకటేశ్వర రావు, వి. శ్రీనివాసులు పాల్గొన్నారు. చివరన కార్యదర్శి జె.వి.కె. బాబు వందన సమర్పణ జేశారు.

### రోటరీ ఇంటరాక్ట్ క్లబ్

సుంకు చెంగన్న శెట్టి మునిసిపల్ హైస్కూల్‌లో 17 తేది నెల్లూరు రోటరీ క్లబ్ ఆధ్వర్యంలో రోటరీ ఇంటరాక్ట్ క్లబ్ ఏర్పాటు చేసారు. ఈ కార్యక్రమంలో రోటరీ క్లబ్ అధ్యక్షులు రొటేరియన్ ధర్మారెడ్డి, బాల సుబ్రహ్మణ్యం, డి. భరత్ కుమార్ రెడ్డి పాల్గొన్నారు. ఎం. అనంత కుమార్ అధ్యక్షునిగా, కుమారి వి. సుభాషిణి కార్యదర్శిగా, కె. పూర్ణ చంద్ర రావు కోశాధి కారిగా రోటరీ ఇంటరాక్ట్ క్లబ్‌కు ఎన్నుకున్నారు. క్లబ్ ఏర్పాటు చేయడంలో ప్రధానో పాధ్యాయులు గుమ్మడి శ్యామ సుందర రావు, ఇన్‌ఛార్జి టీచర్ శ్రీమతి ఎం. విజయలక్ష్మి చొరవ చూపారు.

### నెల్లూరు ఎక్స్‌ప్రెస్ సంచిక ఆవిష్కరణ

తుమ్మల సుబ్బారెడ్డి సంపాదకత్వంలో వెలువడుతున్న నెల్లూరు ఎక్స్‌ప్రెస్ పక్ష పత్రిక వార్షికోత్సవం 21 తేది ఎసి సెంటర్ వద్ద గల నీలిమా, టవర్స్‌లో జరిగింది. మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. సెంట్రల్ బ్యాంకు అధ్యక్షుడు వేనాటి మునిరెడ్డి కార్యక్రమానికి అధ్యక్షత వహించగా, నెల్లూరు ఎమ్మెల్యే టి. రమేష్ రెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేసారు. చివరన ఎన్.ఆర్. కరెంట్ ఇంద్రజాల ప్రదర్శన ఏర్పాటైంది.

### గీతాజ్ఞానయజ్ఞం

టౌన్‌హాల్‌లో నెల్లూరు చిన్మయా మిషన్ ఆధ్వర్యంలో గీతాజ్ఞాన యజ్ఞాన్ని 19 తేది స్వామి చిన్మయా నంద శిష్యురాలు స్వామిని శీలానంద ప్రారంభించి మాట్లాడారు. హిందూ మతానికి ప్రామాణిక గ్రంథాలు వేదాలు, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రాలు, భగవద్గీతలన్నా రామె. నిత్య సాధన గ్రంథం భగవద్గీతలో సాంఖ్య యోగం జ్ఞాన భాండా గారమని, స్థిత ప్రజ్ఞ లక్షణాలు అందులో వున్నాయని వివరించారు. కార్యక్రమంలో చిన్మయా మిషన్ అధ్యక్షుల్లు కొండా బలరామి రెడ్డి, పి.వి. ప్రసన్న కుమార రెడ్డి, మాజీ ఎమ్మెల్యే కె.వి. సుబ్బారెడ్డి, వాకాటి పెంచలు రెడ్డి పాల్గొన్నారు. 28 తేది వరకు జరిగే కార్యక్రమానికి ప్రతిదినం 500 మందికి తక్కువ కాకుండా శ్రోతలు విచ్చేస్తున్నారు.



# రజనీ వేవ్‌కు కాంగ్రెస్‌హస్తం అడ్డు!

ప్రముఖ సినీ హీరో రజనీ కాంత్ తమిళ నాడులో కొత్త ప్రాంతీయ పార్టీకి త్వరలోనే శ్రీకారం చుట్టనున్నారు. లోక్‌సభ ఎన్నికలు మరో ఆరు నెలలుండగా కొత్త ప్రాంతీయ పార్టీని ఏర్పాటు చేయాలని రజనీ కాంత్ చురుకుగా సన్నాహాలు చేస్తున్నారు. తమిళ నాడులో సినీ రాజకీయాల వారసత్వం కొత్తేమీ కాదు. ఎమ్.జి. రామ చంద్రన్, జయలలిత, కరుణానిధి, సినీ వంశానికి చెందిన వారే. ఎమ్.జి. రామ చంద్రన్ తర్వాత అంత ఫాలోయింగ్ వున్న ఏకైక నటుడు రజనీ కాంత్ అన్నది జగమెరిగిన సత్యం. కాగా రజనీ కాంత్‌కు ముఖ్యమంత్రి జయలలితకు మధ్య కొంత కాలంగా కోల్డ్‌వార్ జరుగుతున్న విషయం తెలిసిందే. తమిళనాడులో ఇటీవల బాంబుల సంస్కృతి పెచ్చు పెరిగిందని రజనీ కాంత్ చేసిన వ్యాఖ్యలు సంచలనం సృష్టించాయి. కాగా గత నెల 10 వ తేదిన తిరుమలలో ఏర్పాటైన సభలో రజనీ కాంత్ రాజకీయాల్లోకి రావాలని ఎన్టీఆర్ పిలుపు నివ్వడం యాదృచ్ఛికం కాదని, దాని వెనక రజనీ రాజకీయ రంగ ప్రవేశానికి హోమ్‌వర్క్ జరిగిందని తెలుస్తోంది. జయ మంత్రి వర్గంలోని వీరప్పన్‌కు రజనీ కాంత్‌కు వున్న సినీ సంబంధం ఇప్పుడు రాజకీయ బంధంగా పెన వేసుకుంటోంది. కొత్త పార్టీకి కావల్సిన అన్ని హంగుల్ని వీరప్పన్ సమకూరు స్తున్నారు. జనం - ఓట్లు రజనీ చూసుకుంటారు. కాగా రజనీ పార్టీకి ఎన్టీఆర్ ఆశీస్సులు ఉండనే వున్నాయి. అయితే రజనీ, రాజ్‌కుమార్ సహకారంతో భారత దేశం పార్టీని స్థాపిస్తామని ఎన్టీఆర్ ప్రకటన కొంత గందరగోళం సృష్టించి నప్పటికీ, అటువంటి ఆలోచన ఏదీ లేదని తర్వాత ఎన్టీఆర్ సరిదిద్దు కోవటంతో రజనీ సొంత కుంపటి వేరు అన్నది తేలి పోయింది.

జయ పరిపాలన పూర్తిగా అవినీతి మయమైంది. తమిళ నాడులో జయ లలితకు మునుపటి గ్లామర్ కూడా లేదు. అయితే జయకు ప్రత్యామ్నాయంగా అటు కాంగ్రెస్ కానీ, ఇటు డిఎమ్‌కెకు గానీ ఢీకొనే శక్తి లేదు. రజనీ కాంత్ నేతృత్వంలో గనక కొత్త పార్టీ ఏర్పాటైతే జయలలిత పార్టీకి నూకలు చెల్లడం ఖాయమని కేంద్ర గూఢచారి వర్గాలు అంచనా లేస్తున్నాయి.

# ప్రజాసదస్సులలో కుశలప్రశ్నల కాలక్షేపం!

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్టీఆర్ తలపెట్టిన ప్రజా సదస్సుల ఖర్చు పది కోట్ల రూపాయలు దాటు తుందని అధికారులు అంచనా వేస్తున్నారు. తొలి విడతగా శ్రీకాకుళం, విజయ నగరం, విశాఖ పట్నం జిల్లాల్లో ప్రజా సదస్సులు జరిగాయి. ఆ మూడు జిల్లాల్లో ప్రభుత్వ పరంగా ప్రజా సదస్సుల ఏర్పాటుకు సుమారు కోటి 40 లక్షల రూపాయలు ఖర్చయినట్లు తెలుస్తోంది. ఇది గాకుండా స్థానిక ఎమ్మెల్యేలు దేశం చిన్నా చితకా నాయకులు- స్వాగత ద్వారాలు, బ్యానర్లు, కటౌట్ల కోసం ఖర్చు పెట్టింది కూడా లక్షల్లోనే వుండవచ్చు. "ప్రజల ముంగిట ప్రభుత్వం" పేరుతో ప్రజా సమస్యల్ని నేరుగా ప్రజల వద్దకే వెళ్లి అక్కడి కక్కడే పరిష్క రించటం ఈ ప్రజా సదస్సుల ముఖ్య ఉద్దేశం. కాని ఆచరణలో మాత్రం సమస్యల పరిష్కారం జిల్లా కలెక్టర్ల పైన వుంచారు. ప్రజా సదస్సు జరిగే చోట ఫిర్యాదులు, అర్జీల స్వీకరణకు సుమారు పది కౌంటర్లు తెరిచారు. ఈ కౌంటర్లలో మంత్రులు, ఎమ్మెల్యేలు కూర్చొని ప్రజల దగ్గర నుంచి ఫిర్యాదులు స్వీకరిస్తున్నారు. ప్రతి ఫిర్యాదు పైన మంత్రి గారో, లేక స్థానిక ఎమ్మెల్యేనో ఎండార్స్‌మెంట్ వేసి జిల్లా కలెక్టర్‌కు తోసేస్తున్నారు. నెల రోజుల్లోగా కలెక్టర్ వీటి పై ఏ చర్య తీసుకున్నది సదరు ఫిర్యాదు దారునికి, ముఖ్య మంత్రి కార్యాలయానికి తెలియ జేయాలని ముఖ్యమంత్రి హుకుం జారీ చేశారు. ప్రజా సదస్సు జరిగే ప్రాంతంలో రాష్ట్ర ప్రభుత్వ పథకాలైన కిలో రెండు రూపాయలు, మద్య పాన నిషేధం, గ్రామీణాభివృద్ధి, మంచి నీటి సరఫరా తదితర పథకాలకు సంబంధించిన స్టాల్స్ ఏర్పాటు చేశారు. ముఖ్య మంత్రి మాత్రం కూర్చొని ప్రజల్ని కలుసు కుంటూ వారిని కుశల ప్రశ్నలు వేస్తున్నారు. ఆ తర్వాత స్థానిక రెవిన్యూ అధికారులు ఏర్పాటు చేసిన ఇళ్ల

> **పదికోట్లు ఖర్చుపెట్టి సాధిస్తున్నది శూన్యం; జనంలోనూ ఆసక్తి లేదు!**

పట్టాల్ని ప్రదానం చేసి చివరగా అదే వేదికను బహిరంగ సభగా మార్చి ఉపన్యాసం దంచుతున్నారు. అంతకు మించి ముఖ్యమంత్రి చేస్తున్నది ఏమీ లేకపోవటంతో జనం నిరాశగా ఇళ్లకు మళ్లుతున్నారు. తమ కుమారుడికి ఉద్యోగం అడగటానికి వచ్చిన ఒక ముసలి తల్లికి ఎన్టీఆర్ రెండు చేతులెత్తి నమస్కారం పెట్టి "ఆ ఒక్కటీ అడక్కు" అనే రీతిలో మాట్లాడారు. ఈ సంఘటన విజయ నగరం ప్రజా సదస్సులో జరిగింది. ఇక పై ఉద్యోగాలు మాత్రం అడగ వద్దని ఎన్టీఆర్ బహిరంగంగా ప్రకటించడంతో జనం పెదవి విరిచారు. ప్రజా సదస్సుల సందర్భంగా హాజరైన జనం కూడా పెద్ద సంఖ్యలో లేక పోవటం మరీ విచిత్రం. ఎన్టీఆర్ ప్రజా సదస్సులకు ఇచ్చిన పబ్లిసిటీ అంతా ఇంతా కాదు. మొదటి రోజు శ్రీకాకుళం జిల్లాలో ప్రారంభమైన సదస్సుకు నిర్ణీత కాలం ఉదయం 8 గంటలకు జనం అసలే లేరు. ఎన్టీఆర్ అదృష్టం బాగుండి ఆ రోజు హెలికాప్టర్ చెడిపోయి సదస్సుకు అయిదు గంటలు ఆలస్యంగా రావటంతో అప్పటికి జనం పోగయ్యారు. లేకపోతే జనం లేక సదస్సు వెలవెల అంటూ పతాక శీర్షికలతో వార్తలు వచ్చేవి. విజయ నగరం జిల్లాలో సదస్సు జరిగిన చీపురుపల్లి దగ్గర మాత్రం స్థానిక ఎమ్మెల్యే గద్దెబాబూ రావు కృషి ఫలితంగా జనం పోగయ్యారు. అక్కడ సదస్సు ముగిశాక విజయ నగరం హెడ్ క్వార్టర్‌కు బయలు దేరుతున్న అన్నా వదినలను తన సొంత గ్రామమైన గరివిడికి తీసుకు వెళ్లడంలో గద్దె బాబూరావు సఫలీ కృతుడయ్యాడు. అన్నా వదినల కోసం ఆయన 9 లక్షల రూపాయలు ఖర్చు చేసి అక్కడ ఫైవ్ స్టార్ కుటీరాన్ని నిర్మించాడు అన్నా వదినలు ఒక్క రాత్రి గడపటానికి ఇంత ఖర్చు పెట్టాలా అని మాత్రం అడగొద్దు సుమా?

### మంత్రుల బేజారు

ప్రజా సదస్సులకు వెళ్లిన అన్నా వదినలకు ఏర్పాట్లు, హనీమూన్‌ను తలపించేలా వున్నా మంత్రి తమ్ముళ్లను కుశలం అడిగే నాథుడే లేకుండా పోయాడు. పాపం బస చేయటానికి వసతి దొరక్క వాళ్లు పడిన అవస్థ ఇంతా అంతా కాదు. మంత్రులు ఏ క్షణంలో ఎక్కడున్నదీ తెలీక వాళ్ల గన్‌మెన్‌లు కూడా ఇబ్బంది పడ్డారు. దీనికి తోడు వదిన గారి మంత్రులు, బాబు గారి మంత్రులు ఒకే గెస్ట్‌హౌస్‌లో ఇమడలేక యమ యాతన పడ్డారు.

# "మా ఆవిడ మహా గొప్పది"

ప్రజా సదస్సుల సందర్భంగా ఎన్టీఆర్ పాల్గొన్న ప్రతీ సభలో, విలేఖరుల సమావేశంలో లక్ష్మి పార్వతిని గురించి మహా గొప్పగా వర్ణించి చెబుతున్నారు. ఈ రోజు పార్వతి మామూలు మనిషి కాదు. గొప్ప ప్రజాకర్షణ గల వ్యక్తి. ఆమె పేరుతో ఎన్నో మహిళా సంఘాలు సేవా సంస్థలు వెలుస్తున్నాయి. జనం ఎక్కడికి వెళ్లినా ఆమెకు బ్రహ్మరథం పడుతున్నారు. "షిఈజ్ గ్రేట్" అని ఎన్టీఆర్ ఒక వైపు పొగుడు తుంటే మంత్రులు, ఎమ్మెల్యేలు బిక్క మొహం పెడుతున్నారు. ఎన్టీఆర్ ఒక వైపు పార్వతిని వెనకేసు కొస్తుంటే ఇక తాము ఏమి చెప్పినా లాభం లేదన్నది స్పష్టమై పోయింది. పార్టీలో ఎమ్మెల్యేలకు రోజు రోజుకూ అభద్రతా భావం పెరిగి పోతోంది. ఏ క్షణం ఏం జరుగు తుందో ఊహించటం కష్టంగా వుందని ఎమ్మెల్యేలు, మంత్రులు వాపోతున్నారు.

**జమీన్‌రైతు**

| | |
|---|---|
| సంవత్సరచందా | రూ. 100/- |
| అర్ధసంవత్సర చందా | రూ.50/- |
| విడిప్రతిరూ 3 - | |



Edited, Printed and Published by Nellore Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (I) Ltd